శ్రీ

# దాశరథీశతకము.

బ్రహ్మశ్రీ

మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి విరచిత

[illegible] తాత్పర్యసహితము.



రాజమండ్రి బుక్కు-సెల్లర్సు

అద్దేపల్లి అండు సన్సు వారిచే

ప్రకటింపఁబడినది.



రాజమండ్రి:

పోతాప్రగడ బ్రహ్మానందరావు పంతులుగారి

శ్రీ సుజనరంజని ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

1924.

 [వెల 4 అణాలు.

# పీఠిక

ఈ దాశరధిశతకమును, కంచెర్ల గోపనకవి రచించెను. ఈతడు రామభక్తులలో నగ్రగణ్యుడు భద్రాచలమున శ్రీరామచంద్రునకు, ఆలయము నిర్మించినదీతడే, జగద్విదితమయిన రామదాసుచరిత్రమును, రచియించి భక్తాగ్రేసరుడును, ఆంధ్రలోకమునకు చిరపరిచితుడును, అగు నీతనిం గూర్చి వేరే వ్రాయనక్కఱ లేదు.



శ్రీ ర స్తు.

# దా శ ర థి శ త క ము.

—:೦:—

ఉ. శ్రీరఘురామ చారుతులసీదళదామ శమక్షమాదిశృం
గారగుణాభిరామ త్రిజగన్నుతశౌర్యరమాలలామ దు
ర్వార కబంధరాక్షసవిరామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 1

టీ. శ్రీ=శోభాయుక్తమగు, రఘురామ = రఘుమహారాజువంశమందు పుట్టిలోకములను ఆనందింపజేయువాఁడా, చారు = సొగసైన, తులసీదళదామ = తులసిదళములదండగలవాఁడా, శమ=శాంతము, క్షమ=తాలిమి, ఆది=మొదలగు శృంగార=ఇంపైన, గుణ=గుణములచేత, అభిరామ=మనోహరమైనవాఁడా! త్రిజగత్=మూఁడులోకములందును, నుత=కొనియాడదగిన, శౌర్యరమా=పరాక్రమలక్ష్మియొ, లలామ=ఆభర

ణముగాఁగలవాఁడా! దుర్వార=జయింపశక్యముగాని, కబంధ=కబంధుఁడను పేరుగల, రాక్షస=రాక్షసుని, విరామ=చంపినట్టి వాఁడా! జగత్=జగమునందలి, జన=జనులను, కల్మష=పాపమనెడి, ఆర్ణవ = సముద్రమును, ఉత్తారక = దాటించునట్టి, నామా=పేరుగలవాఁడా! భద్రగిరి = భద్రాచలమునందున్న దాశరథీ! శ్రీరామచంద్రా, కరుణాపయోనిధీ = కరుణా సముద్రుఁడా!

తా. రఘువంశమునఁబుట్టి, అందమైన తులసిపేరును ధరించి మంచిగుణములుగలిగి లోకులు కొనియాడదగిన పరాక్రమముగలిగి కబంధునిచంపి, మనుష్యుల పాపములను పోగొట్టగలిగిన పేరునుగలిగి దయాసముద్రుఁడవైన భద్రాచల రామా.

ఉ. రామవిశాలవిక్రమ పరాజితభార్గవరామ సద్గుణ
స్తోమ పరాంగనావిముఖసువ్రతకామ వినీలనీరద
శ్యామ కకుత్స్థవంశకలశాంబుధిసోమ సురారిదోర్బలో
ద్దామవిరామ భద్రగిరి దాశరథీకరుణాపయోనిధీ.

టీ. రామ=సంతోషింపజేయువాఁడా! విశాల=గొప్పదగు, విక్రమ=పరాక్రమముచేత, పరాజిత=ఓడించబడిన, భార్గవరామ=పరశురాముఁడుగలవాఁడా! సద్గుణస్తోమ=సుగుణములు సమువాయముమా, పరాంగన=ఇతరస్త్రీలయందు; విముఖ=పెడ ముఖముగల, సువ్రత=మంచినియమమునందు, కామ=అభి

లాతనుగలవాఁడా, వినీల=మిక్కిలినల్లనిదగు, నీరద = మేఘముఁవంటి, శ్యామ=నల్లనిశరీరకాంతిగలవాఁడా, కకుత్ స్థవంశ= కకుత్ స్థునికులమనెడి,కలశాంబుధి=పాలసముద్రమునకు,సోమ= చంద్రునివంటివాఁడా ! సురారి=రక్కసులయొక్క, దోర్బల= భుజబలముయొక్క ఉద్దామ=అధికమైన, విరామ=నశింపుగల వాఁడా ! భద్రగిరి=భద్రాచలమునందున్న, దాశరధీ=దశరథునియొక్క కుమారా; శ్రీరామచంద్రా=శ్రీరామచంద్రుఁడా ! కరుణాపయోనిధి=కరుణాసముద్రుఁడా !

తా. పరశురాము నోడించినవాఁడా ! సుగుణములు కలవాఁడా, పరస్త్రీలను కన్నెత్తియైన చూడనివాఁడా ! నీలమేఘమువంటి దేహచ్ఛాయకలవాఁడా, కకుత్ స్థునికులమనెడి సముద్రమునకు చంద్రునివంటివాఁడా ! దయాసముద్రుఁడవగు భద్రాచలరామా !

ఉ. అగణితసత్యభాష శరణాగతపోష దయాలసర్ఝురీ
విగతసమస్తదోష పృథివీసురతోష త్రిలోకపూతకృ
ద్గగనధునీమరందపదకంజవిశేష మణిప్రభాధగ
ద్ధగితవిభూష భద్రగిరిదా .... .... .... 3

టీ. అగణి....భాష=లెక్కింపశక్యముగాని నిజముచెప్పెడివాఁడా ! శర....పోష = కాపాడుమనివచ్చినవారిని రక్షించువాఁడా ! దయా....దోష, దయా=దయయనెడి; లసత్=ప్రకాశించుచున్న, ఝరీ=పారుచున్ననీటిచేత విగత=పోఁగొట్టఁబడిన,

సమస్తదోషా=సకలపాపములుగలవాఁడా! పృథ్వీసుర=బ్రాహ్మణులను; తోష = ఆనందింపజేయువాఁడా, త్రిలో.... శేష, త్రిలోక=మూడులోకములును, పూతకృత్=పవిత్రముచేయు, గగనధునీ=ఆకాశగంగయె, మరంద=పూదేనెగల, పదకంజవిశేష=అడుగుదామరలయొక్క శోభకలవాఁడా! మణిప్రభా=మణులయొక్క కాంతులచేత, దగద్ధగిత = దగదగమెరయు, విభూష=ఆభరణములుకలవాఁడా! భద్ర....నిధీ

తా. నిజమును చెప్పెడివాఁడా! ఆశ్రయించినవారిని కాపాడువాఁడా! మూడులోకములను పావనముజేయు ఆకాశగంగపుట్టిన పాదపద్మముకలవాఁడా! బ్రాహ్మణులను ఆనందింపచేయువాఁడా! మణులచేమెరయు ఆభరణములుకలవాఁడా? దయాసముద్రుడవగు భద్రాచలరామభద్రా!

ఉ. రంగధరాతిభంగ ఖగరాజతురంగ విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ పరితోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజాహృదయసారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరిదా .... .... .... 4

టీ. రంగ....భంగ=భయంకరమైన శత్రువులను వధించినవాఁడా! ఖగరాజతురంగ=గరుత్మంతుని వాహనముగాగలవాఁడా! విపత్ప....తంగ=కష్టములసముదాయమనెడి కటికచీకటులకు సూర్యునివంటివాఁడా, పరితోషితరంగ=సేవించబడిరంగనాథుడుగలవాఁడా, దయాంతరంగ = దయతోకూడిన

మనస్సుకలవాఁడా! సత్సంగ=సుజనుల స్నేహముగలవాఁడా! ....భృంగ=సీతాదేవియొక్క మనస్సను పద్మమునకు తుమ్మెదవంటివాఁడా, శుభాంగ=శుభకరమగు శరీరముకల వాఁడా! భద్ర....నిధీ.

తా. శత్రువులను చంపువాఁడా! గరుత్మంతుని వాహనముగా గలవాఁడా! పాపములను పోగొట్టువాఁడా! సేవింపఁబడిన రంగనాథుఁడుగలవాఁడా! సీతాదేవి మనస్సనెడిపద్మమునకు తుమ్మెదవంటివాఁడా! శుభమైన రూపముగలవాఁడా! దయతోకూడిన భద్రాచలరామభద్రా.

ఉ. శ్రీదసనందనాది మునిసేవితపాద దిగంతకీర్తి సం
పాద సమస్తభూతపరిపాలవినోద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథకులసింధుసుధామయపాద నృత్త గీ
తావినోద భద్రగిరిదాశరధీకరుణాపయోనిధీ. 5.

టీ. శ్రీద=సిరినిచ్చువాఁడా,సనందనాది మునిసేవితపాద= సనందుడు మొదలగు మునులచేపూజింపఁబడిన పాదములుకల వాఁడా, దిగ....పాదా=దిక్కులయొక్క అంతమువరకు కీర్తిని సంపాదించినవాఁడా, సమ....నోద=సకలజీవులను పోషించుట యందు ప్రేమకలవాఁడా! విషా....చ్ఛేద=విచారమను లత నుత్రెంపివేయువాఁడా. నృత్త....నోద = నాట్యమునందును పాటలయందును సంతోషముకలవాఁడా, భద్ర....నిధీ.

తా. సిరులనిచ్చువాఁడా! సనందనాదిమునులచేత పూజింపఁబడు పాదములుగలవాఁడా! దిగంతములవరకు కీర్తిని వ్యాపించినవాఁడా! సకలజీవులను రక్షించుటయందు ప్రీతి కలవాఁడా! రాజకులమునకు సంతోషము కలుగఁజేయువాఁడా! నాట్యమునందును పాటలయందు ఆసక్తిగలవాఁడా! భద్రాచలరామా!

ఉ. ఆర్యుల కెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యుల కంజలెత్తి కవిసత్తముల న్వినుతించి కార్యసౌ
కర్యమెలర్ప నొక్కశతకంబొనఁగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది దాశరథీకరుణాపయోనిధీ. 6.

టీ. కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడవగు, భద్రగిరి దాశరథీ=భద్రాచలనివాసుఁడవగు శ్రీరామా! ఆర్యులకెల్లన్=సుజనులకందరికిని, మ్రొక్కి=నమస్కారములుచేసి, వినతాంగుఁడనై=వంచబడిన శరీరముకలవాఁడనై, రఘునాథభట్టరాచార్యులకు=రఘునాథభట్టరాచార్యులగు గురువునకు, అంజలియెత్తి=దోసిలియొగ్గి, కవిసత్తములన్=కవిశ్రేష్ఠులను, వినుతించి=కొనియాడి, కార్యసౌకర్యము=కార్యశుభము, ఎలర్పన్=లభించునటుల, ఒక్కశతకంబున్=ఒకవందపద్యములను, ఒనఁగూర్చి=సిద్ధపరచి, నేఁడు = ఈరోజున. రచింతున్=చేయుదును, ఇది=ఈశతకమును; ఆదరముతో=ప్రేమతో, గ్రహింపుము=అందుకొనుము.

తా. శ్రీరామా ! పూజ్యులకు మ్రొక్కి ఈదినమున రచియించిన యీశతకమును ప్రేమతో నందుకొనుము.

ఉ. మసకొని రేగుబంట్లకును మౌక్తికములు వెలపోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యె
నా, రసనకుఁ బూతవృత్తి సుకరంబుగ చేకురునట్లు వాక్సుధా
రసములు చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 7

టీ. కరుణా....రథీ మసకొని=ప్రీతిపడి, రేగుబండ్లకును, మౌక్తికముల్=ముత్తెములను వెలపోసినట్లు=వెలనిడినట్లు, దుర్వ్యసనమున్=పేరాసను, చెంది=పొంది, కావ్యము=గ్రంథమును, దురాత్ములకున్=చెడునడతగల జనులకు, ఇచ్చితిన్=ఇచ్చితిని- మోసమయ్యె = మోసముాయెను; నారసనకున్=నానాలుకకు, సుకరంబుగన్ = సులభముగా, పూతవృత్తి=పవిత్రము, చేకురునట్లు=లభించునటుల, సంతసమును=సంతోషమును చెంది=పొంది, వాక్సుధారసములు=పలుకుల తేనెను చిల్కన్=చిందునటులు పద్యముఖరంగమునందున్ = పద్యములు అనెడు నాముఖమందు, నటింపవయ్య = నివసింపవయ్యా.

తా. శ్రీరామచంద్రా! రేగుబండ్లకై ముత్తెములను వెలబోసినటుల శ్రేష్ఠమగు గ్రంథమును దుర్మార్గులకిచ్చుట

వలన అపవిత్రమైన నానాలుకయందు దయచేత నీవునివ సింపుమా.

ఉ. శ్రీరమణీయహార యతసీకుసుమాభశరీర భక్తమం
దార వికారదూర పరతత్త్వవిహార త్రిలోకచేతనో
ద్ధార దురంతపాతకవితానవిదూర ఖరాదిదైత్యకాం
తారకుఠార భద్రగిరి దా.... .... .... 8.

టీ. శ్రీర....హార=శోభగలహారములుగలవాఁడా, అత.... రీర=అగిసెపూవువంటి నల్లనైన దేహకాంతికలవాఁడా, భక్తమం దార=నిన్నునమ్మినవారికోరికలు నెరవేర్చువాఁడా, వికారదూర= చావుపుట్టుకలు లేనివాఁడా, పర....హార=పరతత్త్వమున విహ రించువాఁడా, త్రిలో....ద్ధార=మూడులోకములనున్న ప్రాణు లను పోషించువాఁడా! దురం....దూర=అంతములేనిపాప ములను బాపువాఁడా! ఖరా....ధార=ఖరుడు మొదలగు రాక్షసులనెడి అడవులకు గొడ్డలివంటివాఁడా! భద్ర.... నిధి.

తా. ప్రకాశించుచున్న హారములుకలవాఁడా! అగిశ పూవువంటి నల్లని దేహముగలవాఁడా! భక్తులకోరికలీడేర్చు వాఁడా! పరతత్త్వమున దిరుగువాఁడా! సకలప్రాణులను రక్షిం చువాఁడా! పాపములను బాపువాఁడా! రాక్షసులనుగొట్టిన వాఁడా! భద్రాచలరామా!

ఉ. దురితలతాలవిత్ర ఖరదూషణకాననవీతిహోత్ర భూ
భరణకళావిచిత్ర భవబంధ విమోచనసూత్ర చారు వి

స్ఫురదరవిందనేత్ర ఘనపుణ్యచరిత్ర వినీలభూరికం
ధరసమగాత్ర, భద్రగిరిదా .... .... .... 9

టీ. దురి....విత్ర=పాపములను లతకుఁగొడవలివంటివాఁడా! ఖర .... హోత్ర = ఖరదూషణులనెడి అడవికి దావాగ్నివంటి వాఁడా! భూభ ....చిత్ర = భూమి నేలురహస్యముచు తెలిసిన వాఁడా! భవ....సూత్ర = సంసారమనుకట్టునుండి తప్పించు సాధనమైనవాఁడా! చారు....నేత్ర=బాగుగా వికసించినపద్మ పత్రములవంటి కన్నులుకలవాఁడా! ఘనపుణ్యచరిత్ర=పుణ్యము నెక్కువగలకథగలవాఁడా! వినీ....గాత్ర=మిక్కిలి నల్లనైనగొప్పదైనమేఘముతో సరియైనదేహముగలవాఁడా! భద్ర....నిధీ.

తా. పాపములను లతకుఁగొడవలివంటివాఁడా! ఖరదూషణులను మంటఁగలిపినవాఁడా? భూమినిపాలించు నేర్పరితనము గలవాఁడా! సంసారబంధమునుండి తప్పించెడివాఁడా! పద్మములవంటినేత్రములు కలవాఁడా! నల్లనై పెద్దదియైనమేఘమునకు సరియైన దేహముకలవాఁడా! దయగల భద్రాచలరామా !

ఉ. కనకవిశాలచేల భవకాననశాతకుఠారధార స
జ్జనపరిపాలశీల దివిజస్తుతసద్గుణకాండకాండసం
జనితపరాక్రమక్రమవిశారద శారదకందకుందచం
దన ఘనసారసారయశ దా .... .... .... 10

టీ. కనక....చేల=బంగారుమయమైన నెవల్పుగల వస్త్రము

ను కలవాఁడా! భవ....ధార=సంసారమనెడి అడవి కివాడిగల గొడ్డలి మొనవంటివాఁడా! సజ్జన....శీల = సజ్జనులను రక్షించు నియమముకలవాఁడా! దివి....కాండ=దేవతలచే గొనియాడ బడు మంచిగుణములసముదాయముకలవాఁడా! కాండ.... రద=బాణములవలన గలిగిన పరాక్రమము యొక్క పరిపాటి యందు గడ తేగినవాఁడా! శారద....యశ=శరత్కాల మేఘముల వలెను, కుంద=మల్లె మొగ్గలయొక్కయు, చందన=మంచిగంధము యొక్కయు ఘనసార=కర్పూరము యొక్కయు, సార=నిగ్గువంటి యశ=కీర్తి గల, భద్ర....నిధీ

తా. బంగారుబట్టకలవాఁడా! సంసారమునందలి కష్టములను బాపువాఁడా! సుజనులను రక్షించువాఁడా! దేవతలచే కొనియాడబడువాఁడా! బాణముల యొక్క పరాక్రమమున ఆరితేరినవాఁడా! మిక్కిలి తెల్లనిదగు కీర్తిగల భద్రాచలరామా!

ఉ. శ్రీరఘువంశతోయధికి శీతమయూఖుఁడవైన నీపవి
త్రోరుపదాబ్జము ల్వికసితోత్పలచంపక వృత్తమాధురీ
పూరితవాక్ప్రసూనములఁబూజలొనర్చెదఁజిత్తగింపుమీ
తారకనామ భద్రగిరిదా .... .... .... 11

టీ. తారకనామ = సంసారమునుండి దాటింపఁగలుగు పేరు గలవాఁడా! కరుణాపయోనిధీ = దయాసముద్రుఁడా భద్రగిరి దాశరథీ=భద్రాచలరామ, శ్రీర....ధికిన్=శుభకర

మగు రఘువంశమను సముద్రమునకు, శీతమయూఖుఁడవు=చంద్రుఁడవు, ఐన, నీపవి....ముల్=నీపవిత్రమైన గొప్పవగు పాదపద్మములను, విక....ములన్=ప్రకాశించుచున్న ఉత్పలములు, చంపకములు, అనువృత్తములయొక్క తీయదనము చేతనిండినమాట లనుపుష్పములచేత, పూజ లొనర్చెదన్=పూజలనుచేసెదను, చిత్తగింపుమీ=అందుకొనుమా.

తా. ఓ భద్రాచలరామా! చంపకాదివృత్తములను పుష్పములచేత నిన్ను పూజించెదను. నాపూజను నీవుప్రీతితో నందుకొనుము.

ఉ. గురుతరమైన కావ్యరసగుంభన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిలఁ జాలుదురోటు శశాంకచంద్రికాం
కురముల కిందుకాంతమణికోటి స్రవించినభంగి వింధ్యభూ
ధరమున జాలునే శిలలు దా .... .... .... 12

టీ. కరుణాపయోనిధీ! దాశరథీ! ముష్కరుల్=మూఢులు, సరసులమాడ్కి=రసికులవలె, గురుతరమైన=మిక్కిలి గొప్పదియగు, కావ్యరసగుంభనకు=గ్రంథములయందలి రసముల ఏర్పాటునకు,* అబ్బురమంది=ఆశ్చర్యమునొంది, సంతసిలఁజాలుదురోటు=సంతోషించుటకు సరియగువారగుదురా? (కారు) శశాంకచంద్రికాంకురములకున్=చంద్రునిలేతకిరణములకు, ఇందు....భంగి=చంద్రకాంతపురాళ్ళుస్రవించినటుల, వింధ్య

భూధరమునన్=వింధ్యపర్వతమునగల, శిలలు=రాళ్ళు, జాఱు న్నే=నీరగునా (కావు)

తా. రామా! కావ్యమునందలి రసమును సరసులు గ్రహింపగలవారుకాని మూఢులు గ్రహింపగలరా! చంద్ర కాంతికి చంద్రకాంతపురాళ్ళునీరగునుకాని, వింధ్యపర్వతపు బండరాళ్ళు స్రవించునా ?

ఉ. తరణికులేశ నానుడుల: దప్పులుగల్గిన నీదునామస
ద్విరచిత మైన కావ్యము పవిత్రముగాదె వియన్నదీజలం
బరుగుచు వంకయైన మలినాకృతిఁబాఱినఁదన్మహాత్త్వముం
దరమెగణింప నెవ్వరికి దా .... .... 13

టీ. తరణికులేశ=సూర్యవంశమునకు ప్రభువగు కరు ణాపయోనిధీ భద్రగిరి దాశరథీ! నానుడులన్=నామాటల యందు, తప్పులు=దోసగులు, కల్గినన్=కలిగినను, నీదు.... తము=నీపేరుననరచియింపబడినది ఐనకావ్యము=అయిన గ్రంథ ము, పవిత్రముగాదె = పవిత్రముగదా ! వియన్నదీజలంబు= మిన్నేటినీరు, అరుగుచున్=పారుచు, వంక=వంకర, ఐనన్= అయినను, మలినాకృతిన్=మలినముగలరూపముతో, పారినన్= పారినను, తన్మహాత్త్వమును=దాని అధికతను, గణింపన్= లెక్కపెట్టుటకు, ఎవ్వరికిన్=ఎవ్వరికైనను, తరమె=శక్యమగునా (కాదు)

తా. రామా! నే నిపుడు చెప్పుచుండు కావ్యమున తప్పులున్నను, నీపేరిటనున్నది గావున పవిత్రమైనదే, ఆకాశ గంగ వంకరగా పారినను బురదతో నున్నను దానిమహిమను వర్ణింప నెవరికైన తరమగునా!

ఉ. అజునకుఁ దండ్రివయ్యు సనకాదులకుం బరతత్త్వమయ్యు స
 ద్ద్విజముని కోటికెల్లఁ గులదేవత వయ్యు దినేశవంశభూ
 భుజులకు మేటివయ్యుఁ బరిపూర్ణుఁడవై వెలుగొందుపక్షిరా
 డ్ధ్వజ నినుఁ బ్రస్తుతించెదను దా.... .... 14

టీ. కరుణాపయోనిధీ దాశరథీ! అజునకున్=బ్రహ్మదేవునకు, తండ్రివయ్యు=తండ్రివయ్యు, సనకాదులకున్=సనకసనందనాదిమునులకు, పరతత్త్వమయ్యు=శ్రేష్ఠపదార్థమయ్యును సద్ద్విజమునికోటికెల్లన్=శ్రేష్ఠులగు బ్రహ్మర్షుల సముదాయమున కంతటికి, కులదేవతవయ్యు=ఇంటనున్న దేవుడవయ్యును, దినేశవంశభూభుజులకు మేటివయ్యున్=సూర్యవంశపురాజులకు, అధికుఁడవయ్యును, పరిపూర్ణుఁడవు=అంతటను నిండియున్న వాఁడవు, ఐ, వెలుగొందు=ప్రకాశించు పక్షిరాడ్ధ్వజ=గరుడధ్వజముగలవాఁడా! నిన్ను ప్రస్తుతించెను=ప్రార్థించెదను.

తా. బ్రహ్మకు తండ్రివయ్యును, సర్వమునిసేవితుఁడవయ్యును, బ్రహ్మఋషులకు యిలవేల్పువయ్యును సూర్యవంశపురాజులకు అధికుడవయ్యును, గరుడధ్వజముగలిగి అంతటను నిండియున్న నిన్ను ప్రార్థించెదను.

ఉ. పండితరక్షకుం డఖిలపాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశకంఠవిలుంఠనచండకాండకో
దండకలాప్రవీణుఁడను తావకకీర్తివధూటికిత్తుఁ బూ
దండలుగాఁగ నాకవిత దా .... .... 15

టీ. దాశరథీకరుణాపయోనిధీ, పండితరక్షకుండు=పండితులను రక్షించువాఁడు, అఖిలపాపవిమోచనుడు=సర్వపాపములను బాపువాఁడు, అబ్జ....తుండు = బ్రహ్మేంద్రాదులచేత పూజింపబడువాఁడు, దశ....వీణుడు = రావణునిపదిశిరములను తెగఁగొట్టిన వాడిబాణములు గలవిలువిద్యయందు నేర్పరితనముగలవాఁడు, అను....టికిన్=అనునట్టిమీకీర్తికాంతకు, నాకవిత=నాకవిత్వమును, పూదండలుగాఁగన్=పూవులమాలయగునట్లు, ఇత్తున్=ఇచ్చెదను.

తా. భద్రాచలరామా! పండితులనేలువాఁడు, పాపములబాపువాఁడు, బ్రహ్మాదులచే పూజింపబడువాఁడు, రావణుని తలలు గూల్చినవాఁడు అను నీకీర్తికి నాకవిత్వమును పూలదండగా నిత్తును.

ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట వచ్చినవేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ గల్గునొ గల్గదొ నాఁటి కిప్పుడే
తప్పక చేతు మీభజన దా .... .... 16

టీ. కరుణాపయోనిధీదాశరథీ ! ముప్పునన్=ముసలితనమునందు, కాలకింకరులు = యమభటులు, ముంగిటన్=ఇంటిముందునకు వచ్చిన, వేళన్ = సమయంబున, రోగముల్ గొప్పరమైన చోన్=వ్యాధులు అధికమైనప్పుడు, కఫము, కుత్తుకనిండిన వేళన్=గొంతుకనిండిన సమయమందు, బాంధవుల్ గప్పిన వేళన్= చుట్టములు చుట్టును, చుట్టియుండిన సమయమునందు, మీ స్మరణ=మీతలపు, కల్గునో, కల్గదో=జ్ఞప్తికి వచ్చునో రాదో, నాటికిన్=ఆరోజునకు (మాయగా) ఇప్పుడే= ఈసమయమందే, తప్పక=తప్పకుండ, మీ భజన=మీ సేవ, చేతున్=చేయుదును.

తా. రామా! ముసలితనమున యమభటులు ఇంటికివచ్చినప్పుడు, కఫము కుత్తుకనిండినప్పుడు, చుట్టములు చుట్టుకొనినపుడు నీతలపుకలుగునో కలుగదో కనుక నాటివంతు ఇప్పుడే నిన్ను సేవించెదను.

చ. "పరమదయానిధే పతితపావననామ హరే" యటంచును
స్థిరమతులై సదా భజనసేయుమహాత్ముల పాదధూళి నా
శిరమునఁ దాల్తుమీరటకుఁ జేరకుఁడంచు యముండుకింకరో
త్కరముల కానఁబెట్టు నటఁ దా .... .... 17

టీ. కరుణాపయోనిధీ దాశరథీ ! పరమదయానిధే=గొప్పదయకు నివాసమగువాఁడా! పతితపావననామ = పాపముల

ను బాపునామముకలవాఁడా! హరే=ఓశ్రీహరీ, అటంచు= అనుచు, సుస్థిరమతులై=నిలుకడగలమనస్సుకలవారై, సదా= ఎల్లప్పుడును, భజన....ధూళి=భజనచేయు పుణ్యాత్ముల పాద ములయందలి ధూళిని, నాశిరమున దాల్తున్=నాతలయందు ధరించెదను. మీరటకున్=మీరచ్చటకు, చేరకుఁడు=వెళ్ళకుఁడు అంచున్=అనుచు, యముండు=యమధర్మరాజు, కింకరోత్క రములకున్ = భటులసమూహమునకు, ఆనబెట్టునఁట=ఆజ్ఞా పించునని యందురు.

తా. రామా! హరిభజన సేయువారిపాదధూళి నాశిర మున ధరించెదనుగాన మీరచ్చటకు పోవలదని తనభటులకు యమధర్మరాజు ఆజ్ఞాపించునట.

ఉ. దారుణపాతకాబ్ధికి సదాబడబాగ్ని భవాకులార్తి వి
స్తార దవానలార్చికి సుధారసవృష్టి దురంత దుర్మతా
చార భయంకరాటవికిఁ జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన దా .... .... .... 18

టీ. కరుణాపయోనిధీ దాశరథీ! ఎన్నుకొనన్=ఆలోచిం చుకొనగా, నీతారకనామము = సంసారమును తరింపజేయు నీపేరు, దారుణపాతకాబ్ధికిన్ = భయంకరమైన పాపములను సముద్రమునకు, సదా=ఎల్లప్పుడును, బడబాగ్ని=బడబానలము భవా....ర్చికిన్=సంసారముచే బాధింపబడినకష్టమను గొప్ప

కాననాగ్నికి, సుధారవృష్టి = అమృతవర్షము, దుర....వికిన్= అంతములేని దురాచారములనెడి యడవికి, చండ....ధార= వాడిగలగొడ్డలి మొనవంటిది.

తా. రామా! నీపేరుపాపములకు అగ్నివంటిది, సంసారకష్టములను కాననాగ్నికి అమృతవర్షము; దురాచారములనెడియడవికి గొడ్డలి మొనవంటిది.

చ. హరునకు నవ్విభీషణునకద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికినహల్యకున్ ద్రుపదకన్యకునార్తి హరించుచుట్టమై
పరఁగినయట్టి నీపతితపావననామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమిఁక దా .... .... .... 19

టీ. కరుణాపయోనిధీ, దాశరథీ! హరునకున్=ఈశ్వరునకును, అవ్విభీషణునకున్=ఆవిభీషణునకును, అద్రిజనకున్= పార్వతీదేవికిని, తిరుమంత్రరాజమై=పవిత్రమగుమంత్రశ్రేష్ఠమై కరికిన్=గజేంద్రునకును, అహల్యకున్=అహల్యకును, ద్రుపదకన్యకున్=ద్రౌపదిదేవికిని, ఆర్తిన్=కష్టమును, హరించు= పోగొట్టు, చుట్టము=బంధువు, ఐ, పరగినయట్టి=అయిప్రకాశించినట్టి, నీనామము=నీపేరు, జిహ్వపైన్=నాలుకపైని, నిరంతరము=ఎల్లకాలమును, ఇకన్=ఇదిమొదలు నటింపజేయుమా= నివసింపచేయుమా.

తా. రామా! విభీషణాదులకు పవిత్రమగుమంత్రమై

గజేంద్రాదులకు ఆపదలను బాపుచుట్టమైయొప్పు నీనామమును, ఎల్లప్పుడును నానాలుకపైన నుండునట్లు చేయుము.

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజసేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ విరజానది గౌతమిగా వికుంఠము
న్నారయ భద్రశైలశిఖరాగ్రముగాఁగ వసించి చేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు దా .... .... .... 20

టీ. కరుణాపయోనిధీ, దాశరథీ, నీవు, శ్రీరమా=శ్రీలక్ష్మీదేవి, సీతకాఁగన్=సీతాదేవిగాఁగ. నిజసేవకబృందము=నీపరిచారులసముదాయము; వీర....గాఁగన్=గొప్పదగు వైష్ణవాచారముగల మనుష్యులై యుండఁగా, విరజానది=విరజయను నది గౌతమిగాన్=గోదావరి కాఁగా, ఆరయన్=ఆలోచించఁగా, వికుంఠము=వైకుంఠము, భద్ర....గాఁగ = భద్రాచలశిఖరము కాఁగ, వసించి=ఉండి, చేతనోద్ధారకుఁడైన=జీవులను కాపాడెడువాఁడవైన, విష్ణుడవు=విష్ణుమూర్తివి.

తా. రామా! ఆదిలక్ష్మి సీతగాను, నీసేవకులు వైష్ణవులుగను, విరజానది గోదావరిగను, వైకుంఠము భద్రాచలముగను చేసికొనియుండున్న నీవిష్ణుడవుకాని వేరుకావు.

ఉ. కంటి నదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధివాసముం
గంటి నిలాతనూజ నురుకార్ముకమార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ము లక్ష్మణునిఁ గంటిఁ గృతార్థుఁడనైతి నో జగ
త్కంటకదైత్యనిర్దళన దా .... .... 21

టీ. జగత్కంటక=లోకాపకారులగు, దైత్య=రాక్షసులను, నిర్ధళన=చీల్చిన కరుణాపయోనిధీ! దాశరధీ! నదీతటంబునన్=గోదావరీనదీతీరమును కంటిన్=చూచితిని; భద్ర.... గంటిఁ=భద్రాచలమునుచూచితిని, ఇలాతనూజను=సీతాదేవిని, గంటిఁ=చూచితిన, కార్ము....గంటిని=గొప్పవింటిని, బాణములను, శంఖచక్రములజూచితిని. కృతార్థుఁడనైతిని=కోరినకోరిక తేరినవాఁడనైతిని.

తా. ఓరామా! గోదావరితీరమును, భద్రాచలశిఖరమును, సీతాదేవిని, ధనస్సును, బాణములను శంఖచక్రములను, చూచితిని, ధన్యుడనైతిని.

చ. హాలికునకున్ హలాగ్రమున నర్థము సేకుఱుభంగి దప్పిచే
నలమటఁ జెందువానికి సురాపగలో జల మబ్బినట్లు దు
ర్మలినమనోవికారి నగుమర్త్యుని న న్నొడఁగూర్చి నీపయిం
దలఁపు ఘటింపఁ జేసితివి దా .... .... .... 22

టీ. కరుణాపయోనిధి, దాశరధీ! హాలికునకుఁ=దున్నుకొని జీవించువానికి, హలాగ్రమునన్=నాగటికొనటికొనవలన, అర్థముచేకురుభంగి=ధనములభించునటుల, దప్పిచేన్=దాహముచేత, అలమటజెందువానికి = శ్రమనొందినవానికి సురాపగలోజలము=గంగానదిలోనినీరు అబ్బినటుల, దుర్మ... కారిఁ=మిక్కిలిపాపముగల మనస్సుకలవాఁడను అగు మర్త్య

నిన్=మనుష్యుఁడై న, నన్ను, ఒడగూర్చి=బాగుజేసి, నాప యిఁ=నామీఁద, తలంపు=తలఁపు, ఘటింపఁజేసితివి=కలుగ జేసితివి.

తా. రామా! దున్నుకొని జీవించువానికి నాగేటికొనను, ధనము దొరికినటుల, దప్పిచే బాధింపబడువానికి గంగానదీజలము దొరకినటుల, పాపాత్ముఁడనగు నాకునీపై బుద్ధి కలుగ జేసితివి.

ఉ. కొంజక తర్కవాద మనుగుద్దలిచేఁ బరత త్త్వభూస్థలిఁ
రంజిలఁ ద్రివ్వి కన్గొననిరామనిధానము నేఁడు భక్తిసి
ద్ధాంజనమందు హస్తగతమయ్యె బళీయనఁగా మదీయహృ
త్కంజమునఁ వసింపు మిఁక దా .... .... 23

టీ. కరుణాపయోనిధీ, దాశరథీ! కొంజక=సంశయింపక, తర్కవాదము=పదార్థతత్త్వవిచారము, అనుగుద్దలిచేఁ=అనెడిగుద్దలిచేత, పరతత్త్వభూస్థలిఁ = పరతత్త్వమనుభూమిని, రంజిలఁ=సంతోషముగా, త్రివ్వి=త్రివ్వియైనను, కన్గొనని రామనిధానము=చూడజాలనిరాముఁడను నిక్షేపమును, నేఁడు=ఈదినమందున, భక్తిసిద్ధాంజనమందుఁ=భక్తిచేత రాబడిన కాటుకవలన, హస్తగతముఅయ్యెఁ=చేతికిచిక్కెను, భళీ యనగాఁ=మేలుఅనునట్లు ఇకమదిఁ=ఇటుపైన, మదీయ=నాయొక్క, హృత్కంజమునఁ=హృదయపద్మమునందు; వసింపుము=నివసింపుము.

తా. రామా! పరతత్వమను గుద్దలిచేత త్రవ్వినను లభించనిరాముడను నిధానము భక్తియను నంజనమువలన నేడునాకు లభించెను. ఇఁక నామనస్సును విడువకుము.

ఉ. రాముఁడు ఘోరపాతకవిరాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయరాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముఁడే పరమదైవముమాకనిమాయదుంగుఁగెం
దామరలే భజించెదను దా .... .... 24

టీ. కరుణాపయోనిధీ, దాశరథీ! రాముఁడు=రంజింపచేయువాఁడు ఘోర....ముడు=భయంకరమైన పాపములను పోగొట్టువాఁడు, సద్గుణ....యుడు=సుగుణములను కల్పవృక్షపు తీగెలకు తోటవంటివాఁడు షడ్వి....ముడు=అరువికారములను జయించినవాఁడు. సాధు....ముడు=సాధుజనులను కాపాడెడి నియమముగలవాఁడు, మాకు, రాముఁడే, పరమదైవము=మాకు శ్రీరాముఁడే గొప్పదేవుఁడని మీయదుంగలఁ గెందామరలే=మీపాదకమలములే, భజించెదను=సేవించెదను.

తా. రామా! రాముఁడు, పాపములను బాపువాఁడు, సుగుణములు గలవాఁడు, వికారములను జయించినవాఁడు, సుజనులను కాపాడెడివాఁడు, మాదైవమని పాదములు సేవించెదను.

ఉ. చక్కెరమాని వేముఁ దినఁజాలినకైవడి మానవాధముల్
పెక్కురుబక్కదైవముల వేమఱుఁ గొల్చెద రట్లు కాదయా

మ్రొక్కిననీకు మ్రొక్కవలె మోక్షమొసంగిననీవయీవలెం,
దక్కిన మాట లేమిటికి దా .... .... 25

టీ. కరుణాపయోనిధీ దాశరధీ ! చక్కెరమాని-ప్రపంచ దారను విడిచి, వేమున్= వేపచేదును, తినజాలినకైవడిన్=తిన జాలినట్లు, పెక్కురు=అనేకులు, మానవాధములు=నీచజ నులు, బక్కదైవములన్=సామర్థ్యము లేనిదైవములను, వేమరు= మాటిమాటికి, కొల్చెదరు=సేవించెదరు, అట్లుకాదు. అయ్యా మ్రొక్కినన్=దండమిడినయెడల, నీకు మ్రొక్కవలెన్ నీకునమ స్కరింపవలెను, మోక్షము=మోక్షమును, ఒసంగినన్ ఇచ్చి నను, నీవ=నీవె, ఈవలెన్=ఇయ్యవలెను, తక్కినమా టలు = మిగిలినమాటలు, ఏమిటికిన్ = ఎందులకు (లాభ ము లేదు.)

తా. చక్కెరనుమాని వేమును తినునట్లు మూఢులు మోక్షము నిచ్చు నిన్నుమాని సామర్థ్యము లేని చిల్లరదేవత లను సేవింతురు.

ఉ. రా కలుషంబులెల్ల బయలంబడ ద్రోచిన మా కవాటమై
దీకొని ప్రోచు నిక్కమని ధీయుతులెన్న దదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ గానరు గాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దా .... .... 26

టీ. కరుణాపయోనిధీ ! దాశరధీ ! రా=నీనామము నందలి ,రా, అను నక్షరములు, కలుషంబులెల్ల=పాపములన్ని

టిని, బయలఁ=బయటను, పదద్రోచినఁ=పడునట్లుత్రోయగా, మా = 'మా', అను అక్షరము, కవాటమై=తలుపై, దీకొని=ఎదురువచ్చి, ప్రోచుఁ=రక్షించును; నిక్కమని=నిజమని, ధీయుతులు=బుద్ధిమంతులు విన్నఁ=వించగా, తదీయ వర్ణముల్=ఆ రెండు అక్షరములును (రామ) కైకొని=పుచ్చుకొని, భక్తిచేఁ=ప్రేమచేత, నుడువఁ=మాట్లాడుటకు, కానరు కాక=ఎఱుగరు కాక తెలిసికొనిన యెడల, జగజ్జనుల=లోకమునందలి మనుష్యులను, విపత్పరంపరఁ=కష్టసముదాయములు, దాకొనునే=నచ్చునా! రావు.

తా. రామా! నీనామమాత్రమక్షరముల ప్రభావము నెఱుగరుగాని తెలిసి పఠించిన యెడల లోకులను పాపము చేరనీయునా? చేరదు.

ఉ. రామ హరే కకుత్స్థకులరామ హరే రఘురామ రామ శ్రీ
రామ హరే యటంచు మది రంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించినజనంబు భవం బెడఁ బాసి తత్పరం
ధామనివాసు లౌదు రఁట దా .... .... 27

టీ. కరుణాపయోనిధీ! దాశరథీ! "రామ! హరే! కకుత్స్థకులరామ రఘురామ, శ్రీరామా!" అంచు=అనుచు, మది=మనస్సు, రంజిలఁ=సంతసించునటుల, భేక....లీలఁ=కప్పకుతుకవలె, నీనామము=నీపేరు, స్మరించినజనంబు=స్మరించిన

జనులు, భవంబు=సంసారమును, ఎడబాసి=విడచి, తత్పరంధాముని=ఆవైకుంఠునివాసస్థలమున కాపురముందురట.

తా. రామా! నీనామస్మరణ చేయువారు పాపములు లేనివారై నీనివాసమగు వైకుంఠమున కాపురముందురు.

ఉ. చక్కెరలప్పకున్ మిగుల జవ్వనికెంజిగురాకుమోవికిం
జొక్కపుజుంటితేనియకుఁ జొక్కుచుుం గనలేరు గాక నేఁ
డక్కట రామనామమధురామృత మానుటకంటె సౌఖ్య
మా తక్కినమాధురీమహిమ దా॥ .... .... 28

టీ. కరుణాపయోనిధీ! దాశరథీ! చక్కెరలప్పకున్=పంచదారగడ్డకును, మిగులన్=మిక్కిలి, జవ్వ....కిన్=యౌవ్వనస్త్రీలయొక్క యఱ్ఱనిపెదవులకును, చొక్క....యకున్=స్వచ్ఛమైనతేనెకును, చొక్కుచున్=సంతసించుచు, కనలేరు గాక=తెలిసికొనజాలరుకాని, అక్కటా=అయ్యో నేఁడు=ఈ రోజున, రామ....తము=రామనామము అను అమృతమును, ఆనుటకంటె=త్రాగుటకంటె, తక్కినమాధురీమహిమ=మిగిలిన మాధుర్యము సౌఖ్యమా! (కాదు)

తా. మనుజులు పంచదారగడ్డలకును, స్త్రీలపెదవులకును, జుంటితేనియకును. ఆసింతురు గాని నీనామామృతముకంటె నవి తీయనివికావు.

ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారిపాపముల్
కొండలవంటివైన వెసఁగూలి నశింపక యున్నె సంతతా

ఖండలవైభవోన్నతులు గల్గకమానునె మోక్షలక్ష్మి కై
దండయొసంగకున్నె తుద దా .... .... 29

టీ. కరుణాపయోనిధీ! దాశరధీ! అంసజవాహా=గరుడ
వాహనుడా, నిన్నుఁ=నిన్ను, హృదయంబున=మనస్సునందు,
నమ్మినవారిపాపములు=నమ్మినటువంటి జనులపాపములు, కొం
డలవంటివైనన్=కొండంత పెద్దవైనను, వెసఁగూలి = శీఘ్రముగ
గ్రుంగి, నశింపకయున్నె=చెడకయుండునా! సంత....తులు=ఎడ
తెగని దేవేంద్రభోగములు, గల్గకమానునే=లభింపకమానునే,
మోక్షలక్ష్మి = మోక్షకాంత, కైదండ=చేయూత, ఒసంగ
కున్నె=ఈయకుండునా! తప్పక ఇచ్చును.

తా. రామా! నిన్ను సేవించినవారిపాపము లెట్టివై
నను నశించి ఇంద్రభోగము లభించును. మోక్షలక్ష్మి వాని
నాదరించును.

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ జెందినమీఁగడ పంచదారతో
మెక్కినభంగి నీవిమలమేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్లెరంబున సమాహితదాస్యమనేటిదోయిటన్
దక్క నటంచు జుర్రెదను దా .... .... 30

టీ. కరుణాపయోనిధీ ! దాశరధీ! చిక్కనిపాలపైన్=
చిక్కనిపాలమీద, మిసిమిచెందినమీఁగడ = వెన్నపొందిన
మీఁగడను, పంచదారతోన్=చక్కెరతో (తోరపి) మెక్కిన
భంగి=తినినటుల, నీవి....సంబు = నీమిగులనల్లనిరూపము నెడి

అమృతమును, నామ.... బున్ = నా ప్రేమయనుపళ్ళెరమునందు, సమాహితదాస్యమ నేటిదోయిటన్ = చక్కనిపరిచారము అనే దోసిలియందు, దక్కెన్ = లభించెను? అటంచున్ = అనుచు, జుఱ్ఱెదను.

తా. రామా! వెన్నతోఁగూడిన పాలమీఁగడను పంచదారతోఁగలిపి తినునటుల నీనామామృతమును పరిచారమను దోసిలితో మనసార త్రాగెదను.

చ. సిరులిడ సీత పీడ లెగఁజిమ్ముటకున్ హనుమంతుఁ డార్తిసో
దరుఁడుసుమిత్రిసూతిదురితంబులుమానుప రామనామముం
గరుణ దలిర్ప మానవులఁ గావఁగఁ బన్నినవజ్రపంజరో
త్కరము గదా భవన్మహిమ దా .... .... 31

టీ. కరుణాపయోనిధీ! దాశరథీ! సిరులు = కలుములు, ఇడన్ = ఇచ్చుకొఱకు, సీత = సీతాదేవియు, పీడలు, ఎగఁజిమ్ముటకున్ = పోఁగొట్టుటకు, హనుమంతుడు = ఆంజనేయుఁడు, ఆర్తిసోదరుఁడు = బాధలనుపోఁగొట్టుటకు తమ్ముడైన, సుమిత్రిసూతి = లక్ష్మణుఁడును, దురితంబులు = పాపములు, మానుపన్ = పోఁగొట్టుటకు, రామనామమున్ = నీపేరును, కరుణదలిర్పన్ = కరుణఒప్పులాగున, మానవులన్ = మనుష్యులను, కావఁగ = రక్షించుటకు, పన్నిన = ఏర్పాటుచేసిన, వజ్రపంజరోత్కరముగదా = వజ్రపంజరసముదాయముగదా!

తా. సిరులను ఇచ్చుటకు నీభార్య సీతాదేవియు, పీడలను మాన్పుటకు నీసేవకుఁడు ఆంజనేయుఁడును, బాధలను మాన్పుటకు నీతమ్ముఁడు లక్ష్మణుఁడును, పాపములను బాపుటకు నీపేరును, జనులను రక్షించుటకు నీనామమువజ్రపంజరమునుగాని యితరము గాదు.

చ. హలకులిశాంకుశధ్వజశరాసనశంఖరథాంగకల్పకో
జ్జ్వలజలజాతరేఖలను సాంకములై కనుపట్టుచున్నయీ
కలితపదాంబుజద్వయము గౌతమపత్ని కొసంగినట్లు నా
తలపునఁ జేర్చి కావఁ గదె దా .... .... 32

టీ. హల....లను=నాగలి, అంకుశము,జండా, ధనుస్సు, శంఖము, చక్రము, కల్పవృక్షము, కాంతిగల తామర వీనియొక్క రేఖలచేత, సాంకములు=గురుతులుగలవి, ఐ, కనుపట్టుచున్న=అగపడుచున్న, యీ....యము = యీసొగసైన పాదపద్మములు రెంటిని, గౌతమపత్నికిన్=అహల్యకు, ఒసంగినట్లు=ఇచ్చినటుల; నా....గదె = నా మనస్సునందుంచి రక్షింపరాదా!

తా. నాగలి మొదలగు మంగళప్రదమగు గురుతులుగల పాదములు రెంటిని అహల్యకు ఇచ్చినటుల నామనస్సునందుంచి రక్షింపుము.

చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి ధరిత్రిఁగొమ్మునం
దలవడ మాటి రక్కసునియంగముగీటి బలీందుప్రినిన్ రసా

తలమున వ్రాటి పార్థివశదంబముఁగూల్చినమేటి రామ నా
తలఁపున నాటి రాఁగదవె దా .... .... 33

టీ. జలనిధిమీఁటి=సముద్రమునదూరి, కులశైలము మీటి=కులపర్వతమును ఎగురగొట్టి, ధరి....మాటి=భూమిని కొమ్మమీఁద నేర్పరితనముగానుంచి, దక్షసునియంగముగీటి=రాక్షసుని శరీరముచీల్చి, (హిరణ్యకశ్యపుని) బలీ...మాటి=బలి చక్రవర్తిని పాతాళలోకమునకు అదిమి, పార్థి....మేటి=రాజులసమూహమునుగొట్టిన నేర్పరివగు రామా నాతలపున=నా మనస్సునందు, నాటి=అంటి, రాగదవే=రావేమి.

తా. అవతారస్వరూపుడగు ఓరామా, నామనస్సునం దెప్పుడును దగిలి యుండుము.

ఉ. భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండభుజతాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిఁక లేఁ డనుచున్ గడ గట్టి భేరికా
డాండడడాండడాండనినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దా .... .... 34

టీ. కరుణాపయోనిధీ! దాశరథీ! భండనభీముఁడు=యుద్ధములందు భయమునుకొల్పువాడు; ఆర్త...వుడు=దీనులకు చుట్టమువంటివాడు, ఉజ్వల....కీర్తికిన్=వెలుగొందుబాణములు, అమ్ములు పొదులుగల విలువిద్యయందు భయంకరమైన భుజములయందు తాండవించుచున్నకీర్తిగల శ్రీరామచంద్రునకు,

రెండవసాటిదైవము=మరియొకసమానమైన దేవుఁడు లేఁడు, అను చున్=అనిపలుకుచు, గడకట్టి=బిరుదుకట్టుకొని, భేరికా....ంబు లున్=ఢాం, ఢాం, అనుధ్వనులచేత, అజాండము=బ్రహ్మాండము, నిండన్=నిండునటుల, మత్త వేదండముఁ=మదించిన ఏనుగును, ఎక్కి, చాటెదఁ=చాటెదను.

తా. యుద్ధమునందు భయంకరుఁడును, విలువిద్యయందు ఆరితేరినవాఁడును, దీనులరక్షించువాఁడును, అగు రాముఁడు వేఱొకఁడు లేఁడని దిక్కులు మ్రోయునటుల చాటెదను.

చ. అవనిజకన్నుదోయితొగలందు వెలింగెడుసోమ జానకీ
కువలయనేత్రగబ్బిచనుగొండల నుండుఘనంబ మైథిలీ
నవనవయౌవనం బనువనంబునకుఁ మదదంతి వీవె కా
తవిలి భజింతు నెల్లపుడు దా .... .... 35

టీ. అవ....సోమ=సీతాదేవియొక్క కనుగవఅను కలువలయందు విహరించెడు చంద్రుఁడా! జాన....లన్=సీతాదేవియొక్క కొండలవంటి గొప్పకుచములయందు, ఉండు, ఘనంబ=ఉండుమేఘమా! మైథి....నకుఁ=సీతాదేవియొక్క నూత్నయౌవనము అను వనమునకు, మదదంతివి=మదించినఏనుగవు, ఈవెకా=నీవుగదా! తవిలి=అని ఎల్లపుడుఁ=సర్వకాలమందును, భజింతున్=సేవింతును.

తా. రామా! సీతాదేవియొక్క కలువలవంటి కన్నులకు చంద్రుడవై ఆమెచనుగొండలకు మేఘమై ఆమెయౌవన

మునకు మదపుటేనుగవై యున్న నిన్ను ఎల్లప్పుడును సేవిం
చెదను.

చ. ఖరకరవంశజా విను మఖండితభూతపిశాచడాకినీ
జ్వరపరితాపసర్పభయవారక మైనభవత్పదాబ్జవి
స్ఫురదురువజ్రపంజరముఁ జొచ్చితి నీయెడ దీనమానవో
ద్ధరబిరుదాంక మేమఱకు దా .... .... 36

టీ. కరుణాపయోనిధీ! దాశరధీ! ఖరకరవంశజా=సూర్య
కులమునందుపుట్టినఓరామా! వినుము=ఆలకింపుము. అఖం....
కమైన=కొట్టుటకు శక్యముగాని దయ్యములు, పిశాచములు,
డాకిని శాకిని మొదలగువాని జ్వరములు,పరితాపములు, పాము
లవలనిభయములనుపోగొట్టగలదియైన,భవత్....రము=నీపాద
పద్మములను అధికమైన వజ్రపంజరమందు చొచ్చితిన్=ప్రవే
సించితిని. ఈయెడన్=ఈసమయమునందు, దీన....కమున్=
దీనజనులను గాపాడు బిరుదమును, ఏమరకుము = మరచి
పోవకుము.

తా. సూర్యకులమున బుట్టిన రామా! పిశాచములు
మొదలగువానివలన కలుగు బాధలను పోగొట్టగల నీపాద
ములను వజ్రపంజరమున జొచ్చిన నను కాపాడుము. దీనపోషకు
డవగు బిరుదమును మఱవకుము.

ఉ. జుట్టెదమీకథామృతము జుట్టెద మీపదకంజతోయమున్
జుట్టెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే

జుర్రెద జుర్రు జుర్రఁగ రుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే
తజ్జులతోడి పొత్తిడక దా .... .... 37

టీ. మీకథామృతము = మీకథలను అమృతమును, జుర్రెద, మీపదకంజతోయముల్ = మీపాదకమలములయందలి నీటిని, జుర్రెద, నాను....సంబు = 'రామ,, అను పేరునందు పొంగుచున్న అమృతమును, జుర్రెద, తజ్జులతోడిపొత్తు = పశుప్రాయములతోడి స్నేహమును, ఇడక = నాకీయక, జుర్రు జుర్రఁగ = జుర్రగా జుర్రగా, రుచులు, కనువారిపదంబుఁ = తెలిసికొనువారి సన్నిధిని, కూర్పవే = చేకూర్పవే.

తా. మీకథామృతమును, మీపాదజలములను, మీ నామామృతమును, మనసార జుర్రెదను. దీనిమహిమ నెరిగిన వారి స్నేహమును ఇమ్ము తెలియనివారి యొద్ద నన్నుంచకుము,

ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్ దరిద్రతా
కారపిశాచసంహరణకార్యవినోది వికుంఠమందిర
ద్వారకవాటభేది నిజదాసజనావళి కెల్లప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన దా .... .... 38

టీ కరుణాపయోనిధీ! దాశరథీ! ఎన్నుకొనన్ = ఆలోచించుకొనగా, నీతారకనామము = సంసారమును తరింపజేయు నీపేరు, ఘోర....కోటికిఁ = భయంకరులును, వీరులును, అయిన, యమభటుల సమూహమునకు, గుండెదిగుల్

గుండెభీతి, దరి....నోది = పేదగికమను దయ్యము చంపుట యందు సంతసముగలది, ఎల్లప్రొద్దు=ఎల్లప్పుడును, నిజదాస జనావళికిన్ = తనసేవక సముదాయమునకు, వికు....భేది = వైకుంఠము యొక్క వాకిటితలుపులను తెరచునట్టిది.

తా. నీపేరు యమభటులకు, భీతినికలిగించునదియు, దారిద్ర్యముపోగొట్టునదియు, వైకుంఠపు వాకిటితలుపు తెరచునదియునై యున్నది.

ఉ. విన్నప మాలకింపు రఘువీర నహిప్రతి లోకమందు నా
కన్న దురాత్ముఁడుం బరమకారుణికోత్తమ వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడుం బతితకల్మషదూరుఁడు లేఁడు గాన వి
ద్వన్నుత నీవె నాకు గతి దా .... .... 39

టీ. రఘువీర = రఘుకులమునపుట్టిన వీరుడా,! విన్నపము = నామనవిని, ఆలకించు=విను, లోకమందుకున్=లోకమునందు, నాకన్న, దురాత్ముఁడు = దుర్మార్గుఁడు, నహిప్రతి = మరియొకడులేడు, పరమకారుణికోత్తమ = గొప్పదయగలవారిలో శ్రేష్ఠుడా! వేల్పులందున్ = దేవతలయందు, నీకన్న=నీకంటె, మహాత్ముఁడున్ = గొప్పవాఁడును, పతితకల్మషదూరుడు= పాపాత్ముల పాపములను బాపువాఁడు, లేఁడుగాన, విద్వన్నుత= పండితులచేఁ గొనియాడఁబడువాఁడా! నాకునీవేగతి = నాకునీవే శరణ్యము,

తా॥ రామా! మనుష్యులలో నాకంటె పాపాత్ము డును, దేవతలలో నీకంటె గొప్పవాడును లేడుగాన నామొ రాలించి నన్ను రక్షింపుము.

ఉ॥ పెంపను దల్లివై కలుషబృందసమాగమ మొందకుండర
క్షింపనుదండ్రివై మెయినసించునశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జవై కృప గుఱించి పరంబుఁ దిరంబు గాఁగస
త్సంపద లీయ నీవె గతి దాశరథీ కరుణాపయోనిధీ. 40

టీ॥ కరుణాపయోనిధీ? దాశరథీ, పెంపను దల్లివై = పెంచుటకు తల్లివై, కల...మము = పాపములసముదాయము, అంటు, ఒందకుండఁగ = పొందకుండునటుల, రక్షింపను దండ్రివై=కాపాడుటకు తండ్రివై, మెయిఁగ=దేహమున, నసి.... ముల్ = ఉండెడి పది యింద్రియముల సంకటములను, నివా రింపను=పోగొట్టును, వెజ్జవై =వైద్యుడై, కృపన్=దయను, గురించి=కలిగి, పరంబున్=కైవల్యమును, తిరంబుగాఁగ = శాశ్వతమగునట్లు, సత్సంపదలు=మంచి సిరులు, ఈయఁగ=ఇడు టకు, నీవేగతి.

తా॥ రామా! పెంచుటకు తల్లివి, పాపము రాకుండ రక్షించుటకు తండ్రివి, ఇంద్రియరోగములు మాన్పుటకు వైద్యుడవు, సంపదలను, మోక్షమును ఇచ్చువాడవు. నా కన్నిటికి దిక్కు నీవే సుమీ.

ఉ॥ కుక్షి నజాండపంక్తు లొనఁగూర్చి చరాచర జంతుకోటిసం
రక్షణ సేయుతండ్రివి పరంపర నీతనయుండనైన నా
పక్షము నీవు గావలదె పాపము లెన్నియొనర్చినన్ జగ
ద్రక్షక కర్తవీవె కద దా.... .... 41

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! కుక్షిన్=కడుపునందు, అజాండపంక్తులు=బ్రహ్మాండ సముదాయమును, ఒనఁగూర్చి = చేర్చిఉంచి, చరా....కోటిన్=కదలునవి కదలనవి యైనజీవకోటిని, సంరక్షణచేయు తండ్రి=పోషించెడు తండ్రివి, పాపములు, ఎన్ని ఒనర్చినను=చేసినను పరంపరన్ = ఆవరుసను, నీతనయుండన్ = నీకుమారుని ఐన, నాపక్షము = నాదిక్కు నీవకావలదే = నీవు రావలదా! జగద్రక్షక = లోకములను పోషించువాఁడా! కర్తవు నీవు=సమస్తము చేయువాడవు, ఈవేకదా=నీవేగదా.

తా॥ రామా! సృష్టికర్తవగు నీవు నాకు తండ్రివి కుమారుడనైన నాతప్పులను మన్నించి నాపక్షమును పొంది నన్ను కాపాడుము.

ఉ॥ గద్దరియోగిహృత్కమలగంధరసానుభవంబుఁ జెందుపె
న్నిద్దపుగండుఁ దేఁటి ధరణీసుతకౌఁగిలి పంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక ముక్తినిధానము రామ రాఁగదే
తద్దయు నేఁడు నాకడకు దా.... .... 42

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! గద్దరి....బున్=ధైర్యముగల యోగుల హృదయపద్మమునందలి సువాసనగల పూఁదేనెను చెందు....దేటి=పొందుకాంతిగల పెద్దతుమ్మెద, ధర....నన్=సీతాదేవి కౌగలియును పంజరమునకు రాచిలుకా! ము క్తినిధానమా=మోక్షనిధీ రామ, నేడు నాకడకున్=నేను నాయొద్దకు, తద్దయున్=ప్రేమతో, రాఁగదే=రాకూడదా.

తా॥ రామా! యోగుల హృదయమునందు వసించువాడు నీవు దేవి కౌగిట సంతోషించువాడు! నాదరిజేరుము.

ఉ॥ కలియుగమర్త్యకోటి నినుఁ గన్గొనరానివిధంబొ భక్తవ
త్సలత వహింపవో చటులసాంద్రవిపద్దశవార్థిఁ గ్రుంకుచోఁ
బిలిచినఁ బల్కవింతమఱపే నరు లిట్లనరాదుగాక నీ
తలఁపున లేదె సీతచెఱ దా.... 43

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! కలి....కోటి=కలియుగమందలి మనుష్య సముదాయము, నినున్=నిన్ను, కన్గొనరానివిధంబొ = తెలిసికొననేరకపోవుటయు, భక్తవత్సలత=భక్తులయందు ప్రేమయును వహింపవో=పొందవు, చటుల.... వార్థిన్=భయంకరమైన కష్టకాలమనెడి సముద్రమునందు, క్రుంకుచున్=మునుగుచు, పిలిచినన్=పిలిచినను, పల్కవు=పలుకవు, ఇంతమరుపె = ఇంతమరచిపోవుటయా, నరులు = మనుష్యులు, ఇట్లు=ఈలాగున, అనరాదుగాక=అనదగదుగాని, నీ

తలపున౯=నీమనస్సునందు, సీతచెఱ=సీతాదేవియొక్క చెఱ (రావణుని పురంబునందుండునపుడు) లేదె=జ్ఞాపకము లేదా!

తా॥ రామా! పాపాత్ములగు కలికాలపు మనుష్యుల గాపాడవా! మే మనరాదుగాని సీతాదేవి చెఱయున్నపు డెటుల ఊరకొంటివి! మాపై ప్రేమ లేదా?

చ॥ జనవర మీకథాళి విన సైపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుపునీచునకు౯ వర మిచ్చినావుని
న్ననయము నమ్మికొల్చినమహాత్ముల కేమియొసంగెదో సనం
దననుత మాకొసంగుమయ దా.... 44

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! జనవర=రాజా, మీకథావళి=మీకథల సముదాయమును, వినిద సైపక=వినుటకుఇష్టము లేక కర్ణములందు౯=చెవులయందు, ఘంటికానినోదముల్=గంటచప్పుడు మొదలగు వేడుకలను, సలుపునీచునకున్=చేయుచున్న క్రూరునకు, (హిరణ్యాకశిపునకు) వరము=కోరిన కోరికను (మోక్షము) ఇచ్చినావు, నిను, అనయము=ఎప్పుడును, నమ్మి=నమ్మి కొల్చిన మహాత్ములకు౯=సేవచేసిన వారికి, ఏమి, ఒసంగెదో, దానిన్=దానిని, మాకు ఓసంగము=ఇమ్ము.

తా॥ నీపై విరోధించిన రాక్షసునకు మోక్ష మిచ్చి

నావు నిన్ను నమ్మి సేవించు పుణ్యాత్ముల కేమి ఇచ్చెదవో నాకు దాని నిమ్ము.

ఉ॥ పాపము లొందువేళ రణపన్నగభూతభయజ్వరాదులం
దాపద నొందువేళ భరతాగ్రజ మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁ దమ్ముఁడు నిరుపక్కియలం జని తద్విపత్తిసం
తాపము మాన్పి కాతురఁట దా.... 45

టీ॥ కరుణాపయోనిధీ ! దాశరథీ ! పాపములు=పాపములు ఓందువేళన్=పొందుసమయమందు, రణ....లందున్=యుద్ధము పాములు, పిశాచములు, జ్వరములు. మొదలగువానియందు, ఆపదనొందువేళన్ = కష్టమును పొందునపుడు, భరతాగ్రజ=రామచంద్రా మిమ్ము భజించువారికిన్=నిన్ను కొలుచువారికి, నీవు, నీతమ్ముడు, ఇరుపక్కియలన్=రెండు వైపులను, చని = వెళ్ళి, తద్వి.........పము=ఆపదల బాధను, మాన్పి = పోగొట్టి, కాతురట=రక్షింతురట.

తా॥ రామా ! ఏవిధము చేతనైనను భీతినొందిన నీ భక్తులను, నీవును, నీతమ్ముడునువచ్చి కాపాడుదురట.

చ॥ అగణితజన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడ నీఁద లేక జగతీధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁ గోరితిఁ బదంపడి నాదుభయంబు మాన్పవే
తగదని చిత్తమం దిడక దా.... 46

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! జగతీధవ=ఓరామా! ఆగ....లోన్ _ లెక్కపెట్టుటకు వీలులేని జన్మములయందలి కర్మములవలన వచ్చిన పాపములను సముద్రమునందు, బహు దుఃఖముల్=అనేక విచారములను కెరటములు, తెగిపడన్= తెగిపడుచునటుల, ఈదలేక, పదంపడి=తరువాత, నీపదభక్తినావ చేన్=నీపాదజములయందలి భక్తియను పడవచేత, తగిలి _ పూని, తరింపగోరితిని=దాట ప్రయత్నించితిని తగదు, అని,= రక్షింపరాదని, చిత్తమందు _ మనస్సునందు, ఇడక=ఉంచు కొనక, నాదుభయంబున్, మాన్పవే=పోగొట్టుమా.

తా॥ పూర్వజన్మ కర్మను వచ్చిన పాపసముద్రమున మునిగిపోవుచు, నీపాదముల భక్తియను నావచే దాటనున్న నన్ను వేగముగా దాటించుము.

ఉ॥ నే నొనరించు పాపము లనేకములైనను నాదుజిహ్వకుం
బానకమయ్యె మీపరమపావననామము దొంటిచిల్కరా
మా ననుఁగావు మన్నతుదిమాటకు సద్గతిఁ జెందెఁగావునన్
దాని ధరింపఁ గోరెదను దా.... 47

టీ॥ కరుణాపయోనిధీ ! దాశరథీ ! నేను....ఒనరించు= నేనుచేసిన పాపములు అనేకములు, ఐనను, నాదుజిహ్వకున్= నా నాలుకకు, మీ పరమపావననామము=మీ మిక్కిలి పవిత్రమైన పేరు, పానకము అయ్యెన్, దొంటిచిల్క=మునుపు

రాచిలుక, రామా, ననుగావుము అను తుదిమాటకున్=కడపటిమాటకు, సద్గతిగ్=పుణ్యలోకమును చెందెన్ = పొందెను కావునన్ = గాబట్టి దానిన్=ఆరామశబ్దమును, ధరింపన్ గోరెదను=పొందగోరెదను.

తా॥ నేనెంత పాపాత్ముడనైనను నా నాలుకకు నీనామామృతము రుచిగానున్నది. మునుపు రాచిలుక రామా! యని పిలిచి కడసారి మాటకు అది పొందిన పుణ్యలోకమును నేనును పొందగోరెదను:

చ. పరధనముల్ హరించి పరభామల నంటిపరాన్న మబ్బినన్
మురిపముగానిమీఁదనగు మోస మెఱుంగదుమానసంబుదు
స్తర మిది కాలకింకరగదాహతిపా ల్పడనీక మమ్ము నే
తఱి దరిఁ జేర్చి కాచెదవొ దా.... 48

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! పరధనముల్ హరించి=ఇతరుల ధనమును దొంగిలించి, పరభామలనంటి=ఇతరస్త్రీలను ముట్టుకొని, పరాన్నమబ్బినన్=ఇతరులయింట అన్నము దొరకిన, మురిపముగాని=సంతోషమేకాని, మీఁదన్=మీఁదను, అగుమోసము, దుస్తరము = దాటజాలనిదిఁ కాలు........ పాలు = యమభటులచేత గుద్దులదెబ్బలకు వశేముపడనీక, మమ్మున్ ఏతరిన్ = కాలమునందును, దరిజేర్చి=ఒడ్డునకుజేర్చి, కాచెదరో=రక్షించెదరో.

తా॥ పరధన, పరస్త్రీపరాన్నములకు సంతసించి, పై వచ్చుముప్పు నెరుఁగకనుంటిని, నన్ను యమభటులపాలు పడకుండ గాచుట నీభారము.

ఉ. చేసితి ఘోరకృత్యములు చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ జేరి భజించినవారి పొందు నేఁ
జేసిన నేరముల్ దలఁచి చిక్కులఁబెట్టకుమయ్య యయ్యనీ
దాసుఁడ నయ్య భద్రగిరి దా.... 49

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! ఘోరకృత్యములు=పాపకార్యములు, చేసితి, భాగవతాపచారముల్=మహాత్ములకు అపకారము చేసితిఁ అన్య.... పొందు = ఇతర దేవులను సేవించినవారి స్నేహమును, చేసితిన్ = నేచేసిన, నేరముల్ తలచి, చిక్కుల పెట్టకుము, అయ్య నీదాసుడను, అయ్యా.

తా॥ రామా! పాపములను చేసితిని భగవద్భక్తులకు అపకారము చేసితిని, ఇతరదైవముల సేవించువారి స్నేహము చేసితిని, నన్ను చిక్కులుపెట్టక కాపాడుము, నీ సేవకుడను.

చ. పసులధనంబుఁ జూచి పరభాములఁ జూచి హరింపఁగోరుమ
ద్వసుతరమానసం బనెడు దొంగను బట్టి నిగూఢదాస్యవి
స్ఫురితవివేకపాశములఁ జుట్టి భవచ్చరణాం బనేమరు
త్తరువునఁ గట్టివేయఁగదె దా.... 50

టి. కరుణాపయోనిధీ! దాశరథీ! పరధనంబున్ చూచి= ఇతరుల ధనమునుచూచి, పరభామలఁ జూచి = పరస్త్రీలను చూచి, హరింపన్ =దొంగిలించుటకు, కోరు....సంబు=కోరు నట్టి నామనస్సు నెడిగజదొంగను, పట్టి=పట్టుకొని, నిరూ...లఁ= గట్టిదగు నా సేవవలన కలిగిన జ్ఞానము తాళ్ళచేత, చుట్టి, భవచ్చరణంబు=నీపాదము, అనేకల్పవృక్షమునకు, కట్టివేయ గదే.

తా. రామా ! పరధనములందును, పరస్త్రీలయందును మోహముగల నామనస్సు నెడి దొంగను నీపాదము కల్ప వృక్షమునకు కట్టివేయుము.

చ॥ సలలితరామనామజపసార మెఱుంగను కాశికాపురీ
నిలయుఁడఁ గాను మీచరణనీరజరేణుమహాప్రభావముం
దెలియ నహల్య గాను జగతీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురునితమ్ముఁడఁ గాను భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె దా.... 51

టీ॥ కరుణాపయోనిధీ ! దాశరథీ ! సల....రము=మనో హరమైన రామనామముయొక్క ఫలితమును, ఎఱుఁగను= తెలి యుటకు కాసికాపురి నిలయుడనుగాను=కాశీపట్టణమున నున్న ఈశ్వరు డనుగాను, మీచ....మున్ =మీపాదపద్మముయొక్క పుప్పొడి మహిమను తెలియఁ అహల్యఁ గాను, జగతీవర=

ఓరాజా! నీదగు=నీయొక్క సత్యవాక్యమున్ = నీనిజమైన మాటలను, తెలియ, రావణాసురుని తమ్ముడన్=విభీషణుడను, కాను, భవద్విలాసముల్=నీచర్యలను తలచి, నుతింపన్=పొగడుటకు, నాతరమా=నావశమా! (కాదు).

తా॥ రామా! నీమహిమను తెలిసికొనుటకు ఈశ్వరుడను కాను, పాదమహిమను తెలిసికొనుటకు అహల్యను కాను, నీసత్యమైన మాటలను తెలియ విభీషణుడను కాను నీమహిమలను నేను ఎట్లు వర్ణింపగలను.

ఉ॥ పాతకులైన మీకృపకుఁ బాత్రులు కారె తలంచి చూడఁజ
త్రాత్రికిఁ గల్గెఁ బావన మరాతికి రాజ్యసుఖంబు గల్గెదు
ర్జాతికిఁ బుణ్యమబ్బెఁగపిజాతిమహత్త్వముఁబొందెఁగావునన్
దాతవ యెట్టివారలకు దా.... 52

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ, పాతకులు=పాపాత్ములు ఐనన్=అయినను, మీకృపకున్=మీప్రేమకు, పాత్రులుకారే=అర్హులుకారా, తలంచిచూడఁగ=ఆలోచించి చూడగా, చత్రాతికిన్=చాపరాయికి, పావనముకల్గె=పవిత్రము వచ్చెను, అరాతికిన్=శత్రువగు విభీషణునకు (రాక్షసుడైనను) రాజ్యసుఖంబుకల్గె, దుర్జాతికి=హీనజాతికి, పుణ్యము, అబ్బెన్=లభించెను, కపిజాతికి=కోతులకులము, మహత్వము = గొప్పతనము, ఒందెన్=పొందెను కావునఁ=కాబట్టి, ఎట్టివారలకు=

ఎంతపాపాత్ములకైనను దాతవ = నీవుకోరిన కోరిక లిచ్చు వాడవే.

తా॥ రాయిగానున్న అహల్యకు ప్రాణ మిచ్చితివి. రాక్షసుడైనను విభీషణునకు రాజ్యము ఇచ్చితివి, శబరికి పుణ్య లోకము ఇచ్చితివి, కోతులకు గౌరవము నిచ్చితివి, కనుక నీవెట్టివారినైనను కాపాడుదువని నమ్మియున్నాను.

ఉ॥ మూఁకపాతకవ్రజము మాన్ప నగణ్యము చిత్రగుప్తుఁడే
 మేమని వ్రాయునో శమనుఁ డేమి విధించునో కాలకింకర
 స్తోమ మొనర్చు టేమొ వినఁ జొప్పడ దింతకుమున్నె దీనచిం
 తామణి యెట్లు గాచెదవొ దా.... 53

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! మూఁకపాతకవ్రజము=నాపాపములసమువాయము, మాన్పన్=పోగొట్టుటకు, అగణ్యము=లెక్కింపశక్యముకానిది, చిత్రగుప్తుడు=యమధర్మ రాజుయొద్దనుండు వ్రాతగాఁడు, ఏమనివ్రాయునో, శమనుడు= యముడు, ఏమి=ఏలాగున, విధించునో=ఏర్పాటుచేయునో, కాల.........మము=యమభటుల సముదాయము, ఒనర్చుట, ఏమొ=ఏమిబాధ పెట్టెదరో, వినన్=వినుటకు, చొప్పడదు= వలనుపడదు, ఇంతకుమున్నె=వారు నన్ను బాధించకమునుపే, దీనచింతామణి=దీనులకోరికలు తీర్చువాడా, ఎట్లుకాచెదవో= ఎటుల రక్షించెదవో.

తా॥ రామా ! నేను కడుపాపాత్ముడను, చిత్రగుప్తుడు ఏమివ్రాయునో, యముడేమి ఆజ్ఞాపించునో, యమభటులెంత బాధింతురో తెలియదు, వారు నన్ను బాధింపకమునుపే రక్షింపుము.

ఉ॥ దాసిన చుట్టమా శబరి దాని దయామతి నేలినావు నీ
దాసుని దాసుఁడా గుహుఁడు తావక దాస్య మొసంగినావు నే
జేసినపాపమా వినుతి సేసినఁ గావవు కావు మయ్య నీ
దాసులలోన నే నొకఁడ దా.... 54

టీ॥ కరుణాపయోనిధీ ! దాశరథీ ! శబరి, దాసినచుట్టమా=దగ్గరబంధువా ! దాసిన్=దానిని, దయామతిన్=దయగల మనస్సుతో, ఏలినావు=కాపాడినావు, గుహుఁడు, నీదాసుఁ దాసుడా=నీసేవకునకు సేవకుడా ! తావకదాస్యము=నీ సేవను, ఒసంగినావు=ఇచ్చినావు, నేజేసిన పాపమా, వినుతి జేసినన్=ప్రార్థించినను, కావవు=కాపాడవు, నీదాసులలోన=నీసేవకులలోన, నే నొకడ కావుమయ్య=కాపాడుమయ్య.

తా॥ రామా ! నీ కెట్టిచుట్టముని శబరికి వరమిచ్చితివి, నీసేవకుని సేవకుడా గుహునకు నీసేవ నిచ్చితివి, నేనుమాత్రము కానా ! నన్ను గాపాడవేమి, రక్షింపుము.

ఉ॥ దీక్ష వహించి నాకొలఁది దీనుల నెందఱిఁగాచితో జగ
ద్రక్షక తొల్లి యాద్రుపద రాజతనూజ తలంచినంత నే

సాక్షియమైనవల్వలిడి తక్కట నామొఱ చిత్తగించి ప్ర
త్యక్షము గావ వేమిటికి దా.... 55

టీ॥ కరుణాపయోనిధీ ! దాశరథీ! దీక్షవహించి= పట్టు దలనుపట్టి నాకొలఁది వారలన్ = నావంటి దీనులను, ఎందఱిన్= ఎందరిని, కాఁచితో = కాపాడితివో, జగద్రక్షక=లోకముల నేలువాఁడా ! తొల్లి=ముందు, ద్రుపదరాజతనూజ=ద్రౌపది, తలంచినంతన్=తలఁచుకొనినంతనే, సాక్షయము=తఱుఁగలేనివి, ఐనవల్వలు=అయిన చీరెలు, ఇడితి=ఇచ్చితి, అక్కట= అయ్యో; నామొఱచిత్తగించి=నాప్రార్థన ఆలకించి, ప్రత్యక్షము, కావు, ఏమిటికి=ఏందుచేత.

తా॥ రామా ! నావంటివారల నెందరిని కాపాడలేదు తలచినంతనే ద్రౌపదికి చీర లిచ్చి రక్షించలేదా ? నామొర విని నన్నేల రక్షింపవు. వచ్చి రక్షింపుము.

ఉ॥ నీలఘనాభమూర్తివగు నిన్నుఁ గనుంగొనఁగోరి వేడినన్
జాలము సేసి దాఁగెదవు సంస్తుతి కెక్కిన రామనామమే
మూలను దాఁచుకోఁగలవు ముక్తికి ద్రౌపది పాపమూలకు
ద్దాలము గాదె మాయొసల దా.... 56

టీ॥ నీల=నల్లనైన, ఘనాభ=మేఘమువంటి కాంతిగల, మూర్తివి=శరీరము గలవాడవు, అగునిన్ను, కనుంగొనగోరి= చూడగోరి, వేడినన్=వేడుకొనినను, జాలముచేసి=మాయ

చేసి, దాగెదవు, సంస్తుతికిన్=కొనియాడుటకు ఎక్కిన రామనామమున్=వచ్చిన రామనామమును, ఏమూలలను=ఏస్థలమున, దాచుకోగలవు=మఱుగుపెట్టుకొనగలవు, అది=ఆరామనామము, మాయెడలన్=మాయందు, ముక్తిన్=మోక్షమునకు, ప్రాపు=ఆదాయము పాప... లము=పాపమను దుంపకు గుద్దలి. కాదే=కాదా?

తా॥ రామా! నల్లని నీదేహమును నేను చూడఁగోరఁగా మాయ చేసి దాఁచు చుంటివి, రూపమును దాఁచికొనగలవు గాని, కొనియాడఁదగిన రామనామము నెచట దాఁచుకొన గలవు. అది మోక్షసాధనము పాపములను బాపునది.

చ॥ వలదు పరాకు భక్తజనవత్సల నీచరితంబు వమ్ముకా
వలదు పరాకు నీబిరుదు వజ్రమువంటిది కావ కూరకే
వలదు పరాకు నాదురితవార్ధికిఁ జెప్పవుగా మనంబులోఁ
దలఁతుమెకా నిరంతరము దా.... 57

టీ॥ భక్తజనవత్సల=భక్తులగుమనుష్యులయందు ప్రేమకలవాఁడా! పరాకు వలదు, నీచరితమ్ము=నీకథ, వమ్ముకాన్=ఫలితములేనిదగునటుల, పరాకు వలదు, నీబిరుదు=దీనులగు జనులను రక్షించు నీబిరుదు, వజ్రమువంటిది=చీల్చ శక్యముగానిది, కావకే=కాపాడకయే పరాకు వలదు, నిన్ను నాదురిత

వార్ధికిన్ = నాపాపమను సముద్రమును దాటుటకు, తెప్పవు గాన్ = నావగా, మనంబులోన్ = మనస్సునందు, నిరంతర మును = ఎల్లప్పుడును, తలంతును కాని తలంచెదము గదా !

తా॥ రామా ! భక్తవత్సలుడవు, నమ్మినవారి కోరికలు తీర్చువాడవు అను నీబిరుదులను వ్యర్థముసేయక పొరపాటు పడక నన్ను రక్షింపుము.

ఉ॥ తప్పు లెఱుంగ లేక దురితంబులు సేసితి నంటి నీవు మా
యప్పవు గావు మంటినిక నన్యులకున్ నుదురంట నంటి నీ
కొప్పిదమైన దాసజను లొప్పినబంటుకు బంట నంటి నా
తప్పులకెల్ల నీవె గతి దా.... 58

టీ॥ తప్పులు = దోసములు, ఎఱుంగ లేక = తెలియ లేక = తెలిసికొన లేక, దురితంబులు = పాపములు, చేసితిన్ = చేసితి నని, అంటి నీవు మాయప్పవు = మాతండ్రివి, కావుము = రక్షింపుము, అంటిన్, ఇకన్ = ఇటుమీద అన్యులకున్ = ఇతరులకు, నుదురు = నొసలు, అంటన్ = ముట్టుకొని, (శిరమున చేతులుచేర్చి నమస్కరించి) అంటిన్ = అంటిని, నీకు, ఒప్పిదము = ఇష్టము, ఐన, దాసజనులు, సేవకులు, ఒప్పినబంటుకున్ = ప్రేమగల సేవకునకు, బంటన్ = సేవకుడను, అంటిన్, నాతప్పులకెల్లన్ = నాదోసముల కన్నిటికి, నీవేగతి = పోగొట్టుటకు నీవే దిక్కు.

తా॥ నేను తెలియక పాపములు చేసితిని కాపాడు మంటిని, మాతండ్రి వంటిని, నీబంటునకు బంటునంటి నన్ను గాపాడుము.

చ॥ ఇతఁడు దురాత్ముఁడంచుజనులెన్నఁగనాఱడిఁగొంటినేనెపో
పతితుఁడ నంటి నోపరమపావనమూర్తివి నీవు గల్గ నే
నితరుల వేఁడ నంటి నిహమిచ్చిననిమ్ము పరంబొసంగుమీ
యతులితరామనామమధురాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మి కొల్చెదను దా.... 59

టీ॥ కరుణాపయోనిధీ! దాశరథీ! ఇతఁడు, దురాత్ముడు=పాపాత్ముఁడు అంచున్=అనుచు, జనులు=మనుష్యులు, ఎన్నగన్=ఎంచగా, ఆరడిన్=అపకీర్తిని, కొంటిని=పొందితిని, పతితుడన్=పాపాత్ముడను, నేనెపో, నేనేసుమీ, అంటిన్=అంటిని, ఓపరమ=ఓఅధికుడా, లోకపావనమూర్తివి=లోకము లకు పవిత్రమైన శరీరము గలవాడవు, నీవు, కల్గన్=నీవుండగా నేన్=నేను, ఇతరులకున్=నీవుగాక మరియొక దేవుని, వేడన్=కొలువను, అంటిన్, ఇహము=ఈలోకసౌఖ్యము, ఇచ్చితివేని=ఇచ్చినయెడల, ఇమ్ము, పరంబున్=మోక్షమును, ఒసంగుమి=తప్పక ఈయుము, అతు.... పాళి=సాటిలేని రామ అను పేరు యొక్క తీయని అక్షరముల పంక్తిని, నిరంతరంబు=ఎల్లకాలమును, హృద్గతము=నామనస్సునందున్నవే అని, నమ్మి, కొల్చెదను=సేవించెదను.

తా॥ నన్ను పాపాత్ముఁడని లోకులు నిందించినను భరించితిని, పాపాత్ముఁడ నేనని చెప్పుకొంటిని, నిన్నుగాక యితరులను సేవించనంటిని. ఈలోకమున సౌఖ్యమిచ్చినను ఈయక పోయినను మోక్షము నిమ్మంటిని, నేను మీనామమును మనస్సునందుంచి సేవించుచుంటిని.

ఉ॥ అంచితమైననీదుకరుణామృతసారము నాదుపైనిఁ బ్రో
క్షించినఁ జాలు దాన నిరసించెదఁ నాదురితంబులెల్లఁ దూ
లించెద వైరివర్గ మెడలించెదఁ గోర్కుల నీదుబంటనై
దంచెదఁ గాలకింకరుల దా.... .... 60

టీ॥ అంచితమైన=శ్రేష్ఠమైన, నీదు, కరుణామృతసారము, ప్రేమామృతతేటను, నాదుపైని = నామీఁద, ప్రోక్షించిన = చల్లిన, చాలు, దాన = దానిచేత, నాదురితంబులెల్లన్= నాపాపములన్నింటిని, నిరసించెద=పోగొట్టుకొనియెదను, వైరివర్గమును=శత్రువుల సముదాయమును, దూలించెద=తరిమివేయుదును, కోర్కుల్ = చెడుకోరికలను, ఎడలించెదన్ = త్రోసివేయుదును, నీదుబంటన్=నీసేవకుఁడను, ఐ, కాలకింకరులను=యమభటులను, దంచెద = మొత్తెదను.

తా॥ రామా! నీపవిత్రమగు నామామృతమును నాపై చల్లినయెడల దానితో పాపములను పోగొట్టుకొనియెదను, శత్రువులను గెలిచెదను, కోరికలను విడుతును, యమభటులను పారదోలుదును, నీబంటనై యుండెదను.

చ॥ జలనిధు లేడు నొక్కమొగిఁ జక్కికిఁ దెచ్చె శరంబుఱాతినిం
పలరఁగఁ జేసె నాతిగఁ బదాబ్జపరాగము నీచరిత్రముం
జలజభవాదినిర్జరులు సన్నుతి సేయఁగ లేరు గావునం
దలఁప నగణ్య మయ్య యిది దా.... 61

టీ॥ శరంబు=నీబాణము, జలనిధులు ఏడున్=ఏడుసముద్రములను, ఒక్క మొగిన్=ఒక్కమాటుగా, చక్కికిన్=ఒకస్థలమునకు, తెచ్చెన్ = తెచ్చెను, పాదాబ్జపరాగము = పాదపద్మములధూళి, ఱాతిని, ఇంపలరన్ = ఇంపుమీరగా, నాతిగన్ = స్త్రీనిగా, చేసెన్=చేసెను, నీచరిత్రమున్=నీకథను జలజభవాదినిర్జరులు=బ్రహ్మమొదలగు దేవతలు, సన్నుతిసేయగన్ లేరు = కొనియాడజాలరు, కావునన్=కనుక, ఇది= ఈనీమహిమ, తలపన్=ఆలోచింపగా అగణ్యమయ్యా=లెక్కింపశక్యముకానిదయ్యా!

తా॥ రామా! నీబాణ మొక్కటి ఏడుసముద్రములను ఒకచోట గూర్చెను, పదధూళి ఱాతిని స్త్రీనిగా జేసెను, నీకథలను బ్రహ్మాది దేవతలు కొనియాడజాలరు అయిన నేనెంతవాఁడను.

ఉ॥ కోఁతికి శక్యమా యసురకోటుల గెల్వను గెల్చెఁబో నిజం
బాతనిమేన శీతకరుఁ డౌట దవానలుఁ డెట్టివింత మా
సీతపతివ్రతామహిమ సేవకుభాగ్యము మీకటాక్షముం
ధాతకు శక్యమా పొగడ దా.... 62

టీ॥ అసురకోటులన్=రాక్షస సముదాయమును, గెల్వ ను=జయించుటకు, కోతికిన్ శక్యమా, గెల్చెచో=గెల్చె నను కొందము, దవానలుఁడు=అగ్ని, ఆతనిమేనన్=వాని శరీరము నందు, శీతకరుఁడు=చల్లని కిరణములుకలవాఁడు, ఔట=అగుట, ఎట్టివింత=ఎంత ఆశ్చర్యము, మాసీత పతివ్రతామహిమ=మా తల్లిసీతమ్మ యొక్క పతిభక్తిప్రభావము, సేవకు భాగ్యము= మిమ్ము కొలుచువానిభాగ్యము, మీకటాక్షముల్=మీ ప్రేమను గల కీరకంటిచూపును, పొగడన్ = పొగుడుటకు, ధాతకున్= బ్రహ్మకు అయినను శక్యమా! కాదు.

తా॥ రామా! ఒకకోతిరాక్షసులను జయించుటయా! జయించినను ఆతని శరీరమునకు అగ్ని చంద్రునివలె చల్లగ నుండుటా! ఎంతవింత ఇది మాతల్లి సీతమ్మప్రభావము. నీ బంటు అగుట ఆంజనేయుని భాగ్యము నీకడకంటిచూపుల మహిమను బ్రహ్మయైనను కొనియాడనగునా.

ఉ. భూపలలామ రామ రఘుపుంగవ రామ త్రిలోకజరాజ్యసం
స్థాపన రామ మోక్షఫలదాయక రామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నినుఁ బ్రస్తుతి సేసెదనయ్య రామ సీ
తాపతి రామ భద్రగిరి దా.... .... 63

టీ॥ భూపలలామరామ=రాజులలో అధికుడవగు ఓ రామా!, రఘుపుంగవరామ=రాఘుకులమునకు పుట్టిన అధికుడ

వగు రామా! త్రిలో...రామ=మూడులోకములయందును రా జ్యమును స్థాపించిన రామ, మోక్షఫలదాయక రామ=మోక్ష ములిచ్చువాడ వగురామా, మదీయపాపములు=నాపాపములను పాపగదయ్య=పోగొట్టవయ్య, రామ నినున్, ప్రస్తుతిచేసెదక్=కొనియాడెదను, రామా! సీతాపతి రామ=సీతకు భర్తవైన రామా, రామ కరుణాప........రథీ

తా॥ రాజులలో అధికుఁడా! ఓరఘువంశమునబుట్టిన శ్రేష్ఠుడా! మూఁడులోకములను రాజ్యము నిలిపినవాఁడా! మోక్షము నిచ్చువాఁడా! సీతాపతియగు రామా! నిన్ను సేవిం చెద. పాపములు బాపుము.

ఉ॥ నీసహజాంబు సాత్త్వికము నీవిడిపట్టు సుధాపయోధి ప
ద్మాసనుఁ డాత్మజుండు కమలాలయ నీప్రియురాలు నీకు సిం
హాసన మిద్ధరిత్రి గొడు గాకస మత్యులు చంద్రభాస్కరుల్
నీసుమతల్ప మాదిఫణి నీవె సమస్తముఁ గొల్చినట్టి నీ
దాసులభాగ్య మెట్టిదయ దా.... 64

టీ॥ సాత్త్వికము = సత్వగుణము, నీసహజంబు=నీతో కూడ పుట్టినది సుధాపయోధి = పాలసముద్రము, నీవిడినట్టు= నీవుండుస్థలము, పద్మాసనుఁడు=బ్రహ్మ, ఆత్మజుండు=కొడుకు, కమలాలయ = లక్ష్మీదేవి, నీప్రియురాలు = నీభార్య, ఇద్ధరిత్రి= ఈభూమి నీకు, సింహాసనము = సింహరూపముగల కూర్చుం

దేవుగద్దె, ఆకాసము, గొడుగు, చంద్రభాస్కరుల్=సూర్య చంద్రులు, అక్షులు=కన్నులు, ఆధిఫణి= మొదటిపాము నీ సుమతల్పము = నీపూలపాన్పు, సమస్తమున్=అంతయు, నీవే, ఇట్లైనన్ను, గొల్చినట్టి, నీదాసులభాగ్య మెట్టిదయ=నీదాసుల భాగ్యము ఎంతపుణ్యమునిచ్చునది?

తా॥ సాత్వికము నీతోబుట్టినది పాలసముద్రము నీ వుండుస్థలము, బ్రహ్మ నీకొడుకు, లక్ష్మి నీభార్య, భూమి నీ పీఠము, సూర్యచంద్రులు నీకన్నులు ఇట్టి ప్రపంచమే నీవైన నిన్ను కొల్చువారిభాగ్య మెంతగొప్పదై యుండును.

చ॥ చరణము సోఁకినట్టిశిల జవ్వనిరూపగు టొక్కవింత సు
స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటివింతగాని మీ
స్మరణఁ దనర్చుమానవులు సద్గతిఁజెందిన దెంతవింత? యీ
ధరను ధరాత్మజారమణ దా.... 65

టీ॥ ధరాత్మజారమణ=సీతాపతీ, దాశరథీ, ధరను= భూమియందు, నీచరణముసోకినట్టిశిల=నీపాదము తగిలినరాయి జవ్వనిరూపు=స్త్రీరూపము- అగుట, ఒక్కవింత, సుస్థిరము గన్=మిక్కిలి స్థిరముగా నీటిపై=నీటిమీద, గిరులు=కొం డలు, తేలినది, ఒకటివింత, కాని మీస్మరణన్=మిమ్ముతలం చుటయందు, తనర్చు మానవులు=ఒనర్చు మనుష్యులు, సద్గ తిన్=ఉత్తమలోకమును, చెందిన=పొందినది, ఎంతవింత= ఎంత ఆశ్చర్యము.

తా॥ సీతాపతియగు రామా! నీపాదములు తగిలిన రాయి స్త్రీయగుటయు, నీటిపై రాళ్లనువైచి సేతువుకట్టుటయు వింతయైనను నిన్ను తలచువారు మోక్షప్రాప్తులగుట వింత కాదు.

ఉ॥ దైవము తల్లి దండ్రి తగుదాత గురుండు సఖుండుని న్నెకా
భావనసేయుచున్న తఱిఁ బాపము లెల్ల మనోవికారదు
ర్భావితుఁ జేయుచున్నవి కృపామతి వై ననుఁ గావు మీజగ
త్పావనమూర్తి భద్రగిరి దా.... 66

టీ॥ జగత్పావనమూర్తి = మూఁడులోకములను పావనముచేయు రూపముకలవాఁడా (రామా) దైవము, తల్లి, దండ్రి తగుదాత = కోరినకోరికలను ఇచ్చువాఁడా; గురుండు, సఖుఁడు = స్నేహితుఁడు, నిన్నె కా = నీవేగదా యని, భావన సేయుచున్న తఱిన్ = తలంచుచున్న సమయమునందున, పాపము లెల్ల = పాతములన్నియు, మనోవికారదుర్భావితున్ = మనస్సునందలి వికారములచేత చెడినమనస్సుకలవానిగా, చేయుచున్నవి, నన్ను, కృపామతివై = కరుణగల మనస్సుకలవాడవై, కావుమీ = కాపాడుమీ

తా॥ రామా! తల్లివి, తండ్రివి, దాతవు, గురుడవు, స్నేహితుడవు, నీవే యని నమ్మిన నన్ను కాపాడుము.

ఉ॥ వాసవరాజ్యభోగసుఖవార్థిని దేలుప్రభుత్వమబ్బినన్,
ఆసకు మేర లేదు కనకాద్రిసమానధనంబుఁగూర్చినం,గాసు

వెంటరాదు కని కానకచేసినపుణ్యపాపముల్, వీసరపోవనీవు
పదివేలకుఁజాలుభవంబుఁగోల్లనీ, దాసునిగాఁగ నేలికొనుదా

టీ॥ (కరుణాపయోనిధీ! దాశరథీ!) వాస.... ర్థిన్= దేవేంద్రరాజ్యభోగములయొక్క సౌఖ్యమనెడి సముద్రమున తేలుఁ ప్రభుత్వము=తేలెడు ఆధిపత్యము, అబ్బినఁ=లభించినను, ఆసకుఁ, మేర=హద్దు, లేదు, కనకా........ధనంబున్=మేరు పుపొడవుధనమును, కూర్చినన్=చేర్చినను, కాసును=కాసైనను, వెంటరాదు, కని, కానక=తెలిసి తెలియక, చేసిన పుణ్య పాపములు, వీసరపోవనీవు=తప్పకవకానీయవు, పదివేలకుఁ= పదివేలకు (ఆధనము) చాలు=చాలును, భవంబునోల్లన్=పుట్టు కను మరికోరను, నీదాసునిగాఁగ=నీసేవకునిగా, ఏలికొను= పాలించుము.

తా॥ ఇంద్రపదవివచ్చినను, ఆశకు అంతములేదు. ఎంత ధనము ఉన్నను అంతమున కాసైనను వెంటరాదు. నాకాధన మును, ఇహమును అక్కరలేదు. నన్ను నీదాసునిగా జేసికొని కాపాడుము.

ఉ॥ సూరిజనుల్ దయాపరులు సూనృతవాదులలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁ దాల్పఁగా జనులు పావనమైన పరోపకార స
త్కారమెఱుంగలేరకట దా.... 68

టీ॥ సూరిజనుల్=పండితులైనవారును, దయాపరులు=దయకలవారును, సూనృతవాదులు=సత్యము పలికెడువారు, అలుబ్ధమానవుల్=దురాశలేనివారు, వీరవతివ్రతాంగనలు=విశుచనిపతిభక్తి కలవారును,విప్రులు=బ్రాహ్మణులు, గోవులు=ఆవులు, వేదముల్=వేదములును, మహీభారమున్=భూమియొక్క బరువును, దాల్పగా=ధరింపగా, అకటా=అయ్యో, జనులు, పావనము, అయిన, పరోపకారసత్కారము=ఇతరులకు ఉపకారము చేయువారికి చేయదగిన మర్యాదను, ఎఱుంగలేరు=తెలియజాలరు.

తా॥ పండితులు, మొదలగువారు పరోపకారమునకై భూభారమును మోయుచున్నను ఈ మనుష్యులుమాత్రము తగిన సేవచేయకున్నారు.

ఉ॥ వారిచరావతారమున వారిధిలోఁ జొరఁబాఱి క్రోధవి
స్తారగుఁడైన యానిగమతస్కరవీరనిశాచరేంద్రునిం
జేరి వధించి వేదముల చిక్కెడలించి విరించికిన్ మహో
దారత నిచ్చి తీవె కదా దా.... 69

టీ॥ వారి చరావతారమున = మత్స్యావతారమున, వారధిలోన్ = సముద్రములోన, చొరఁబాఱి = ప్రవేసించి, క్రోధవిస్తారగుఁడై=మిక్కిలి కోపముగల, ఐన........ నిన్=అయిన ఆ వేదములను దొంగిలించిన వీరుడగు సోముడను

రాక్షసుని, వధించి,=చంపి, వేదములచిక్కు=వేదముల బాధను, ఎడలించి=పోగొట్టి, విరించికిన్=బ్రహ్మకు, మహోదారతన్= మిక్కిలి అధిఖ్యతతో ఈవే ...కదా=నీవేకదా.

తా. మున్ను మత్స్యావతారమున సముద్రమున జొచ్చి సోమకాసురుని చంపి వేదములను తెచ్చి బ్రహ్మకు ఇచ్చిన మహోదారవు నీవేకదా.

చ. కర మనురక్తి మంథరముఁ గవ్వముగా నహిరాజు దాౘ్రడుగా
దొరఁకొని దేవదానవులు దుగ్ధపయోధిమథించుచున్నచో
ధరము చలింపలోకములు తల్లడ మందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించి తీవె కద దా.... 70

టీ. కరము=మిక్కిలి, అనురక్తిన్=ప్రేమతో, మంధరమున్ = మందరపర్వతమును, కవ్వముగాన్, అహిరాజు = వాసుకి, త్రాడుగాన్=కవ్వపు త్రాడుగా, దొఱకొని=ఏర్పాటు చేసుకొని, దేవదానవులు=దేవతులును, రాక్షసులును, దుగ్ధపయోధి=పాలసముద్రమును, మధించుచున్నచో = చిలుకునపుడు, ధరము=భూమి చలింపన్=వడకగా, లోకములు, తల్లడమందగన్=భీతినిపొందగా కూర్మమై=తాబేలై, ధరాధరము = ఆమంధరపర్వతమును, ఈవ=నీవే, ధరించితిమి= ధరించితిమి.

తా. దేవతలు, రాక్షసులు పాలసముద్రమును మథించునపుడు మంధరపర్వతమును మూపుయందు ధరించి లోకమును కాపాడినవాడు నీవేకదా ?

ఉ. ధారుణిఁ జాపఁ జుట్టినవిధంబునఁ గైకొని హేమనేత్రుఁ డ
వ్వారిధిలోన డాఁగినను వానివధించి వరాహమూర్తి వై
ధారుణిఁ దొంటికైవడిని దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చి తీవె కద దా.... 71

టీ. హేమనేత్రుఁడు=హిరణ్యాక్షుఁడు; ధారుణిన్ = భూమిని, చాపన్=చాపను చుట్టినవిధంబునన్=చుట్టినరీతిగా, కైకొని=ఎత్తుకొని, అవ్వారిధిలోన్=ఆసముద్రములో, డాఁగినన్ = డాఁగినప్పటికిని; వరాహమూర్తివై = పందిరూపమును ధరించి, ధారుణిన్=భూమిని, దక్షిణశృంగమునన్=కుడికోరతోడ, ధరించి=తాల్చి, తొంటికైవడిన్=మునపటివలె, విస్తారము=ఎక్కువ, ఈవె = నీవె, ఒనర్చితివికదా=చేసితివికదా.

తా. హిరణ్యాక్షుఁడు భూమిని చాపచుట్టగా చుట్టినప్పుడు, వరాహరూపమున భూమిని కుడికొమ్మునందుంచి భూమిని మునుపటివలె నుద్ధరించలేదా.

చ. పెట పెట నుక్కుఁగంబమున భీకరదంతనఖాంకుర ప్రభా
పటములఁ గప్పు నుప్పతిలి భండనవీథి నృసింహాభీకర

స్ఫుటపటుశక్తి హేమకశిపుం విదళించి సురారిపట్టి నం
తటఁ గృప జూచి తీవె కద దా.... 72

టీ. ఉక్కుకంబమున = ఇనుపస్తంభమందు, పెటపెట= పెటపెటమని చప్పుడగునటుల, భీకర....లము = భయంకరమైన కోరలు గోళ్ళుకొనలు కాంతిసముదాయము, కప్పఁ = అంతటను వ్యాపింపగా, ఉప్పతిలి=పుట్టి భండనవీథిఁ=యుద్ధరంగమున, నృసి....శక్తి = నరసింహావతారముయొక్క భీకరమైన స్వచ్ఛమైన గట్టిదియైన బలముచేత, హేమకశిపుం = హిరణ్యకశిపుని, కదలించి=చీల్చి, అంతటఁ=అటుతరువాత, సురారిపట్టిన్=వానికొడుకు ప్రహ్లాదుని, కృపఁ=ప్రేమతోడ, ఈవె = నీవె చూచితివిగదా=చూచినావుగదా,

తా. రామా ! భయంకరమైన, నరసింహావతారమున స్తంభమునబుట్టి హిరణ్యకశిపునిచంపి వానికొడుకగు ప్రహ్లాదుని భక్తునిగా చేసుకొనలేదా ?

చ. పదయుగళంబు భూగగనభాగములన్ వెస నూని విక్రమా
స్పద మగునబ్బలీంద్రు నొకపాదమునం దలక్రింద నొత్తి
మే, లొదవజగత్త్రయంబుఁబురుహూతునకియ్యవటుండవైన
చి, త్పదమలమూర్తి వీవెకద దా.... 73

టీ. పదయుగళంబున్ = రెండుపాదములను, భూగగనభాగములన్=భూమ్యాకాశములందు, వెసన్=ఒప్పునట్లుగా!

ఊని=నొక్కి, విక్రమాస్పదము= పరాక్రమపుస్థానము, అగు నబ్బలీంద్రున్=ఆబలిచక్రవర్తిని, ఒకపాదమునన్=ఒకపాదము చేత, తల, క్రిందన్=క్రిందికి ఒత్తి=నొక్కి, ఒదవన్=కలుగు నట్లు, జగత్రయంబు=మూడులోకములును పురుహూతునకు= దేవేంద్రునకు, ఇయ్యన్=ఇచ్చుటకొఱకు, వటుండవు=బ్రహ్మ చారివి, ఐన, చిత్పదమమూర్తి ఈవెకద=చిదానందరూపమున కలవాడవునీవేకదా!

తా. రెండుపాదముల చేతను భూమ్యాకాశములును ఒకపాదమున బలిని అడచి మూడులోకముకములనుదేవేంద్రున కిచ్చిన మాయవటుడవు నీవేకదా! రామా.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల నెల్ల వధించి తత్కళే
బరరుధిర ప్రవాహమునఁ బైతృకతర్పణ మొప్పఁ జేసి భూ
సురవరకోటికిన్ ముదము సొప్పడ భార్గవరామమూర్తివై
ధరణి నొసంగి తీవెకద దా.... 74

టీ. ఇరువదియొక్కమారు, ధరణీశులన్ = రాజులను, ఎల్లన్=అందరిని వధించి=చంపి, తత్క....మునన్=ఆశరీరమున నుండి కారురక్తమువలన, ఒప్పన్=ఒప్పునట్లుగా, పైతృకతర్ప ణము=పితృతర్పణమును, చేసి, భూసురకోటికిన్=బ్రాహ్మణ సముదాయమునకు, ముదము = సంతోషము, చొప్పడన్ = కలుగులాగున, భార్గవరామమూర్తివి=పరశురాముడవు, ఐ,

ధరణిన్ = భూమిని, ఈవె = నీవే, ఒసంగితిసి = ఇచ్చితివి, కద=కదా ?

తా. ఇరువదియొక్క మారులు రాజులను వధించి వారి రక్తముతో పితృతర్పణముచేసి ఈభూమిని బ్రాహ్మణులకు యిచ్చిన పరశురాముడవు నీవేకదా ! రామా !

చ. దురమునఁదాటకందునిమి ధూర్జటివిల్ దునుమాడి సీతనుం
బరిణయ మంది తండ్రి పనుపన్ ఘనకాననభూమి కేఁగి
దు, స్తరపటుచండకాండకులిశాహతి రావణకుంభకర్ణభూ
ధరములఁ గూల్చి తీవెకద దా.... 76

టీ. దురమునన్ = యుద్ధమునందు, తాటకన్=తాటక నురక్కసిని, తునిమి = చంపి, ధూర్జటివిల్=ఈశ్వరుని ధనస్సును, తునుమాడితివి=విఱిచితివి. సీతనున్=సీతను, పరిణయమయి=పెండ్లాడి, తండ్రిపనుపన్=తండ్రిపంపగా, ఘన.... కిన్=భయంకరమైన అడవులకు, ఏగి=వెళ్ళి, దు స్త....తిన్=దాటశక్యముగాని, వేగమును, బలమునుగల బాణముల వజ్రాయుధపు దెబ్బలచేత, రావ....లన్=రావణుడు కుంభకర్ణుడు అనుకొండలను ఈవె=నీవె, కూల్చితికద=కూలనేస్తితి కదా.

తా. యుద్ధమునందు తాటకను జంపి శివునిధనస్సును విరిచి, సీతను బెండ్లాడి, అడవులకువచ్చి, భయంకరమైన బాణ

ములచేత రావణకుంభకర్ణులను చంపినవాడవు నీవెకదా ? దశరథరామా.

చ. అనుపమయాదవాన్వయసుధాబ్ధిసుధానిధి కృష్ణమూర్తి నీ
కనుజుఁడు గా జనించి కుజనావళి నెల్ల నణంచి రోహిణీ
తనయుఁడనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తి వై
తనరిన వేల్పు వీవె కద దా.... 76

టీ. అను........నిధి=సాటిలేని, యాదవకులమను పాల సముద్రమునకు చంద్రుడగు కృష్ణమూర్తి, నీకు, అనుజుడు గాన్=తమ్ముడుగా, జనించి=పుట్టి కుజనావళిన్=పాపాత్ముల సముదాయమును, ఎల్లన్ = అంతయు, అణంచి=పోగొట్టి, రోహిణీతనయుఁడనంగన్ = రోహిణీదేవికొడుకనునట్లు, బల దర్పములన్=బలముయొక్క అధికతచేత, బలరామమూర్తి= బలరామావతారుడవు, ఐ, తనరిన వేల్పువు=పుట్టిన దేవుడవు. ఈవెకదా=నీవేకదా.

తా. శ్రీకృష్ణుడు నీకు తోబుట్టువుగా యాదవవంశమున రోహిణీపుత్రుడను పేరున బుట్టి బలరాముడను ఖ్యాతిగాంచి వాడవు నీవేకదా. రామా !

చ. సురలు నుతింపఁగాఁద్రిపురసుందరులల్ వరియింప బుద్ధరూ
పరయుఁగఁ దాల్చితీవ్ర త్రిపురాసురకోటి దహించునప్పు డా

హారునకుఁ దోడుగా వరశరాసనబాణముఖోగ్రసాధనో
త్కర మొనరించి తీవె కద దా.... 77

టీ. సురలు=దేవతలు, నుతింపగాన్ = కొనియాడగా, త్రిపురసుందరులన్ = త్రిపురములయందలి స్త్రీలను వరియింపన్=వరించుటకు, అరయగన్=ఆలోచింగా, బుద్ధరూపు బుద్ధుని రూపమును, ఈవు=నీవు, తాల్చితివి=ధరించితివి ; త్రిపురాసుర కోటికిన్=త్రిపురమునందలి రాక్షసులను దహించునపుడు, ఆహారునకున్=ఆయీశ్వరునకు, తోడుగాన్, వరము=శ్రేష్ఠమైన విల్లుభాణములు మొదలగు భయంకరమైన యుద్ధసాధనములను ఒనరించితికద=సమకూర్చితివికదా.

తా. వేల్పులు కొనియాడ త్రిపురస్త్రీలను వరించుటకు బుద్ధుడవై త్రిపురములయందలి రాక్షసుల వధించునపుడు; విల్లును, భాణములు, మొదలగు యుద్ధసాధనములు నీవే గదా సమకూర్చితివి. రామా!

ఉ. సంకరదుర్గమై దురితసంకులమైనజగంబుఁ జూచి స
ర్వాంకపలీల నుత్తమతురంగము నెక్కి కరాపిఁ బూని వీ
రాంకవిలాస మొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చె దీవె కద దా.... 78

టీ. సంకరదుర్గమై = వర్ణసంకరముచేత, కడుభయంకరమై, దురితసంకులమై=పాపముచేత నిండినది, ఐనజగంబున్=

అయినలోకమును, చూచి సర్వంకషలీలన్=మిక్కిలి సంతోషముతో, ఉత్తమ తురంగమున్=శ్రేష్ఠమైన గుఱ్ఱమును, ఎక్కి కరాసిన్ = చేతికత్తిని, పూని=దరించి వీర = వీరులయొక్క, అంక=గురుతుయొక్క; విలాసమున్=సొగసు, ఒప్పన్=ఒప్పునట్లు, కలికాకృతిన్ = కలికిరూపముతో, సజ్జనకోటికిన్=సుజన సముదాయమునకు, నిరాతంకము = అడ్డులేని తనమును, ఒనర్చెదు = చేసెదవు, ఈవకదా=నీవేకదా.

తా. వర్ణసంకరమై కడుభయంకరమైన లోకమును చూచి, ఉత్తమాశ్వమునెక్కి చేతికత్తిని ధరించి, భయంకరుడవై దుష్టులను వధించి సుజనులను రక్షించువాడవు నీవే కదా రామా ?

చ. మనమున నూహాపోహలు మఱ్వకమున్నెకఫాదిరోగముల్
దనువుననంటి మేనిబిగి దప్పకమున్నె నరుండు మోక్షసా
ధన మొనరింపఁగావలయుఁదత్త్వవిచారముమాలియుండుట
ల్తనువునకున్ విరోధమిది దా.... 79

టీ. మనమునన్=మనస్సునందు; ఊహాపోహలు=ఊహాపోహలు, మఱ్వకమున్నె=మరచిపోవకముందె, కఫాదిరోగముల్=కఫము మొదలగు రోగములు, తనువునన్=శరీరమున, అంటి=తగిలి, మేనిబిగి=శరీరబలము, తప్పకమున్నె = చెడకముందె, నరుండు=మనుష్యుడు మోక్షసాధనము=మోక్షమున

కుపాయము, ఒనరింపగావలెన్ = చేయవలెను, తత్వవిచారమున్=నిజమును తెలిసికొనుటను, మానియుండుటల్=విడిచి ఇది=ఈలాగున నుండు, తనువునకున్=శరీరమునకు, విరోధము=శత్రువు.

తా. తెలివితేటలు చెడకమున్నె, కఫము మొదలగు రోగములు రాకమున్నె మోక్షమును పొందుటకు ఉపాయమగు తత్వవిచారమును చేయవలెను, దానిని మానుట శరీరమునకు శత్రువుసుమీ! రామా!

చ. ముదమున కాటపట్టు భవమోహమదద్విరదాంకుశంబు సం
పదలకొటారు కోరుకులపంట పరంబున కాది వైరుల
న్నదన జయించుత్రోవ విపదబ్ధికి నావగదా సదా భవ
త్పదమలనామసంస్మరణ దా.... 80

టీ. భవ....రణ=నీపవిత్రమగు నామధ్యానము, ముదమునకున్=సంతోషమునకు, ఆటపట్టు=స్థానము, భవ....శంబు=సంసారమందలి ప్రేమయను మదపుటేనుగకు అంకుశము, సంపదలకొటారు=సిరులకుఉనికి, కోరుకులపంట, మనోరథఫలము, పరంబునకున్=వరాక్షమునకు, ఆది=మూలము, వైరులన్ = శత్రులను, అదనన్=సమయమునందు, జయించుత్రోవ=జయించుదారి, సదా=ఎల్లప్పుడు విపదబ్ధికి=పాపమను సముద్రమునకు, నావవుకదా=ఓడవుకదా రామా!

తా. రామా! నీపేరు, సంతోషమునకు ఉనికి, సంసారమునందలి కష్టమను మదపుటేనుగునకు అంకుశము సిరులకు యిల్లు, పగతుర జయించుత్రోవ కష్టమను సముద్రమునకు ఓడవంటిది.

చ. దురితలతానుసారిభవదుఃఖకదంబము రామనామభీ
కరతరహేతిచేఁ దెగి వకావకలై చనకుండ నేర్చునే
తరిగొని మండుచుండు శిఖి దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె దా.... 81

టీ. దురిత....బము=పాపముల నెడి తీగెలనుసరించి వచ్చు సంసారదుఃఖముల సముదాయము; రామ....అచేన్=రామనామము అను భయంకరమైన కత్తిచేత తెగి, వకావకలై=ముక్కముక్కలై, చనకుండ నేర్చునే=పోవకుండ నుండగలదా, తరిగొని=రగులుకొని, మండుచుండు, శిఖిన్=అగ్నిని, దార్కొనిన్=దగ్గరకుపోయిన, శల....రము=మిడుతలు మొదలగు పురుగులగుంపు, విలీనమై=అందుకలసి, చనదె=చచ్చిపోవా?

తా. రామా! పాపముతో వచ్చు జన్మదుఃఖము, నీనామస్మరణమాత్రమున అగ్నికడ జేరిన, మిడుతులవలె నాశనము కాకమానునా?

చ. హరిపదభక్తి నింద్రియజయాన్వితుఁ డుత్తముఁ డింద్రియంబుల
న్మరుగక నిల్పనూదినను మధ్యముఁ డింద్రియపారవశ్యుఁడై
పరఁగినచో నికృష్టుఁ డని పల్కఁగ దుర్మతినైన నన్ను నా
దరమున నెట్లు కాచెదవొ దా.... 82

టీ. హరిపదభక్తిన్ = విష్ణుపదములు సేవించుటచేత, ఇంద్రియజయాన్వితుఁడు = ఇంద్రియములను జెయించినవాఁడు, ఉత్తముఁడు=శ్రేష్ఠుఁడు, ఇంద్రియములన్ = ఇంద్రియములను, మరుగక=లోఁపడక నిల్పన్=నిలుపుటకు, ఊనినను=యత్నించినను, మధ్యముఁడు=నడిపివాఁడు, ఇంద్రియపారవశ్యుఁడు=ఇంద్రియములకు అధీనమైనవాఁడు; ఐ పరగినచోన్=ఉన్నయెడల, నికృష్టుఁడు=అధముఁడు, అని, పల్కఁగన్=చెప్పఁగా, దుర్మతిన్=, చెడుమనస్సుకల నన్ను, ఆదరమునన్=ప్రేమతో ఎట్లు=ఏలాగున, కాచెదవో=రక్షించెదవో.

తా. రామా! విష్ణుని పాదసేవవలన ఇంద్రియములను జయించినవాఁడు ఉత్తముఁడు, జయించుటకు ప్రయత్నించువాఁడు మధ్యముఁడు, లోనైనవాఁడు అధముఁడు, అధముఁడనగు నన్ను ప్రేమను కాపాడుము.

చ. వనకరి చిక్కెమైనసకు వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వకను వేఁదురుఁ జెందను లేళ్లు తావిలో
మనికి నశించెఁ దేఁటి తరమా యిరువూఁటిని గెల్వనైదు
సా, ధనములు నీవె కావఁ దగు దా.... 83

టీ. వనకరి=అడవియేనుగు, మైనసకు = ఆడఏనుగకు (కామముచేత) చిక్కెన్=పట్టుపడెను; మీను=చేప, వాచవికిన్=నోటిరుచికి, చెడిపోయెన్=చెడిపోయెను, చిల్వ=పాము,

తాన్ = తాను, వినికికి=మంచిపాటను వినుటకు, చిక్కెన్ = చిక్కెను, లేళ్ళు, కనువెదురు=చూపులవెల్లిని, చెందెన్=పొందెను. తేటి=తుమ్మెద, తావిలున్=మంచివాసనలో, మనికిన్=వసించుటచేత, నసించెన్=చెడెను; ఇరుమూటి=ఆరు; ఇంద్రియములను, గెల్వన్=జెయించుటకు, రమా=శక్యమా, ఐదుసాధనముల్=అయిదుసాధనములచేతను, నీవ, కావవగున్=రక్షింపవలెను.

తా. రామా! ఏనుగు స్త్రీమోహమున చెడెను. చేప నోటిరుచివలన చెడెను. పాము పాటలవిను కోరికచే చెడెను. లేళ్ళు కన్నుల అందమునకు చిక్కి చెడెను, తుమ్మెద సువాసన కోరి చెడెను. ఈరీతిగా కామాదులకు చిక్కినవారు చెడుచున్నారు. అయిదు సాధనములచేతను నీవె రక్షింపవలెను.

చ. కరములుమీకుమ్రొక్కులిడఁగన్నులుమిమ్మునెచూడజిహ్వ
మీస్మరణఁదనర్ప వీనులు భవత్కథలన్ వినుచుండి నాస
మీ, యడుగులను బెట్టుపూసరుల కాసగొన బరమార్థసాధ
నోత్కర మది చేయవే కృపను దా....

టీ. కరములు=చేతులు, మీకున్ మ్రొక్కులిడన్=నమస్కారము పెట్టుటకొఱకు, కన్నులుమిమ్మునే, చూడన్=కన్నులు మిమ్మును చూచుటకును, జిహ్వ=నాలుక, మీస్మరణ=మిమ్మును ధ్యానించుటకు, తనర్పన్ = చేయుటకు,

వీనులు=చెవులు, భవత్కథలక్=మీకథలను, వినుచుండి=విను చుండుటకును, నాస=ముక్కు, మీయఱుతన్=మీ మెడ యందు పెట్టు, పూదండలకు, ఆనగొనన్=కోరుటకును, అది= ఇటువంటి, పర....రము=మోక్షమును సాధించు సాధన సము దాయములను, కృపన్=దయ చేత, చేయవే=ఈయుమా.

తా. రామా! నాచేతులు మిమ్ము పూజించుటకును, న్నులు మిమ్ము చూచుటకును, నాలుక మీ నామస్మరణము సేయుటకును, ముక్కు మీమెడనున్న పుష్పమాలను వాసన చూచుటకును ఈలాటి మోక్షమును సాధించు కార్యములనే నాచేత చేయించుము.

చ. చిరతరభక్తి నొక్క తులసిదళ మర్పణసేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖసంఘములో వెలుఁగున్ సదా భవ
త్స్ఫురదరవింద పాదములఁ బూజ లొనర్చినవారి కెల్లఁ ద
త్పర మఱచేతిధాత్రిగద దా.... 85

టీ. చిరతరభక్తిన్=శాశ్వతమైన భక్తితోడ, ఒక్క తులసీదళము, అర్పణసేయువాడు, ఖేచ....లోన్=ఖేచరులు, గరుడులు, ఉరగులు మొదలగువారి సముదాయమునందు, వెలుగున్=ప్రకాశించును. సదా=ఎల్లప్పుడును, భవ....లన్= మీప్రకాశించు పాదపద్మములపూజలు, ఒనర్చినవారికిన్= చేసినవారికి, ఎల్లన్=అందరికి తత్పరము=ఆ మోక్షము, అరచేతి ధాత్రి=అరచేతనున్నదిగదా.

తా. రామా! నీకు భక్తితో ఒక తులసిదళమును ఇచ్చినయడల లఖేచరులు మొదలగువారియందు కీర్తికలవాడగును, నిన్ను ఎల్లప్పుడును పూజించువారికి మోక్షము అరచేతనుండును.

ఉ. భానుఁడు తూర్పునందుఁ గనుపట్టినఁ బావకచంద్ర తేజముల్
హీనతఁ జెందినట్లు జగదేకవిరాజిత మైననీపద
ధ్యానము సేయుచున్నఁ బరదైవమరీచు లడంగ కుండునే
దానవగర్వనిర్దళన దా.... 86

టీ. దానవగర్వనిర్దళన=రాక్షసులను మదము అణచువాడా., భానుడు=సూర్యుడు, తూర్పునందు = తూర్పుదిక్కునందు, కనుపట్టినన్=అగపడగానె, పావక=అగ్నియొక్కయు, చంద్ర=చంద్రునియొక్కయు తేజముల్=కాంతులు, హీనతన్=లోపమును, చెందినట్లు=పొందినటుల జగ....తము=లోకములకు ముఖ్యమై ప్రకాసించునది. ఐననీపదద్యానము, ఐన, నీపదధ్యానము=నీపాదములయందలి చింతనము సేయుచున్నన్ =చేయుచుండగా, పరదైవమరీచులు=ఇతర దేవతల కాంతులు, అడంగకుండునే=చెడిపోక నిలుచునా.

తా. సూర్యుడుదయింపగనే అగ్ని మొదలగు ఇతర వెలుంగులు కాంతిచెడిన విధమున, నీపాదములను కొలుచుచుండగా ఇతర దైవముల ప్రభవములు నసింపవా.

ఉ. నీమహనీయతత్త్వరసనిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ
దాముని గ్రుంకులాడక వృథా తనుకష్టముఁజెంది మానవుం
డీమహిఁ లోకతీర్థముల నెల్ల మునింగిన దుర్వికారహృ
త్తామసపంకముల్ విడునె దా.... 87

టీ. నీమ....బ్ధిలోఁ = నీఅధికమైన తత్త్వరసమువలన ఏర్పాటుఅయిన జ్ఞానముతోఁడ కూడిన, కథలను అమృతసముద్రమునందు, తాఁ=తాను, మును=ముందు, క్రుంకులాడక= మునుగక వృథా=వ్యర్థముగా తనుకష్టమున్ = శరీరకష్టమును చెంది=పొంది, మానవుండు=మనుష్యుడు, ఈమహిలోకతీర్థములన్=ఈభూమియందుగల సకలదీర్థములను, మునింగినన్=మునగగనే, దుర్వి....లన్ = చెడువికారములుకల మనస్సునందలి అజ్ఞానమను; బురదలు; విడునే=పోవునా! (పోవవు)

తా. రామా! శ్రేష్ఠమగు తత్త్వసారము నందుగల జ్ఞానమను అమృత సముద్రమున మునుగక ఈలోకమునగల నదులలో మునిగిన యెడల అజ్ఞానము పోందదు.

ఉ. కాంచలవస్తుసింకలితకల్మష మగ్నిపుటంబు వెట్టి వా
రించినరీతి నాత్మనిగడించినదుష్కరదుర్మలత్రయం
బంచితభక్తియోగతహనార్చిఁదగుల్పక పాయునే కన
త్కాంచనకుండలాభరణ దా.... 88

టీ. కన........రణ=ప్రకాశించుచున్న బంగారుకుండలములు ధరించినవాడవగు, ఓ రామా ! కాంచ....మము=బంగారువస్తువునందు తగినమురికికి అగ్నిపుటంబు పెట్టి=అగ్నిలో వేసి, వారించినరీతి = పోగొట్టినటుల, ఆత్మన్=మనస్సునందు, నిగుడించిన=చేర్చిన, దుష్కర=విడువశక్యముకాని, దుర్మలత్రయంబు=మనస్సువాక్కు, కాయము, అను మూడు చెడు పదార్థములను; అంచి........నార్చిన్ = కొనియాడదగిన భక్తి యోగమను అగ్నియందుంచక, పాయునే = విడుచునా, (విడువదు)

తా. రామా ! బంగారువస్తువునకు మురికిపట్టునపుడు అగ్నిలో వేసి ఆమురికి పోగొట్టినటుల నీమనస్సునందు చేరిన మనోవాక్కాయములను, భక్తియోగమను అగ్నిలోనుంచిన గాలిపోదు.

ఉ. నీసతి పెక్కుకల్మిలిడ నేర్పరి లోక మకల్మషంబుగా
నీసుత సేయ పావనము నిర్మితకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁ డిచ్చునాయువులు నిన్ను భజించినఁ గల్గకుండనే
దాసుల కీప్సితార్థములు దా.... 89

టీ. నీసతి=నీభార్య, పెక్కు కల్మిలు=అనేక సంపదలు ఇడన్=ఇచ్చుటకు నేర్పరి=నేర్పుకలది, నీసుత=నీకూతురు (గంగ) లోకములన్ = జగములను, అకల్మషంబుగాన్ = పాప

ము లేనటుల పావనము=పవిత్రము, సేయున్=చేయును, నీసుతుడు=నీకొడుకు, (బ్రహ్మ) నిర్మి....తుఁడై=ఏర్పరచిన పనులు చేయుటయందు నేర్పరియై, ఆయువులు, ఇచ్చున్, నిన్ను, భజించిన=సేవించిన, దాసులకు=సేవకులకు, ఈప్సితార్థములు=కోరిన కోరికలు, కల్గకుండునే=కలుగకపోవునా.

తా. నీభార్య (లక్ష్మి) సంపదలిచ్చును. కూతురు (గంగ పాపముల బాపును, నీకుమారుఁడు (బ్రహ్మ) ఆయువునిచ్చును, నీవు కోరినకోరికలిత్తువు నిన్ను సేవించినవారి భాగ్యమునకు మేరయున్నదా ?

ఉ. వారిజపత్త్రమం దిడినవారివిధంబున వర్తనీయమం
దారయ రొంపిలోనఁ దను వంటనికుమ్మరపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు విచారగుఁడై పర మొందఁగాదె స
త్కార మెఱింగి మానవుఁడు దా.... 90

టీ. వారిజపత్త్రమందు= తామరాకునందు, ఇడిన=ఉంచిన దారివిధంబునన్=నీటివలెనే. వర్తనీయమందు = త్రోవయందు అరయన్=ఆలోచింపగా, రొంపిలోన్=బురదయందు తనువు = శరీరము, అంటని = అంటుకొనని, కుమ్మరిపురుగు లాగున, సంసారమునన్= సంసారమునందు, మెలంగుచున్= తిరుగుచు మానవుఁడు=మనుష్యుఁడు, విచారగుఁడై =పరమాత్మను

ఆలోచించువాడై సత్కారము=భగవంతుని సేవ, ఎఱింగి=
తెలిసి, వరము=మోక్షము ఓంద౯ కాదె = పొందునుకదా.

తా. రామా! మనుష్యుడు తామరాకుమీఁద నీటి
వలెసంసారమందున్ననుకున్నరపురుగులాగున అంటక=పరమా
త్మునివిచారించుచు మోక్షమునువిచారించుచు సాధించవలెను.

ఉ. ఎక్కడితల్లిదండ్రి సుతు లెక్కడివారు కళత్రబాంధవం
బెక్కడ జీవుఁ డెట్టితను వెత్తినఁ బుట్టుచుఁ బోవుచున్నాడఁ
డొక్కఁడె పాపపుణ్యఫల మొదిందనొక్కఁడెకానరాఁడు వే
ఱొక్కఁడు వెంటనంటిభవ మొల్లనయాకృపఁజూడవయ్య నీ
తక్కరిమాయలం దిడక దా.... 91

టీ, ఎక్కడితల్లి దండ్రి=తల్లి దండ్రి లెక్కడవారు,
సుతులు=బిడ్డలు, ఎక్కడి వారు, కళత్ర బాంధవంబు = భార్య
చుట్టరికము, ఎక్కడ, జీవుడు=దేహి, ఎట్టితనువు=ఎట్టిశరీరము,
ఎత్తినను=ధరించినను, ఒక్కడె=ఒంటిగానే, వెంట నంటి=
వెనుదగిలి, వేరొక్కడు=మరియొకడు, కానరాదు=అగపడదు,
భవము= పుట్టుక, ఒల్లనయ్యా = ఇష్టపడనయ్యా! నీతక్కరి
మాయలందున్ = నీకపటమోసములందు, ఇడక = ఉంచక,
కృపన్=ప్రేమతో, చూడవయ్యా.

తా. ఎక్కడితల్లి, ఎక్కడితండ్రి, ఎక్కడి బిడ్డలు,
ఎక్కడిపెండ్లాము, ఎక్కడిచుట్టములు, జీవుడు అనేకజన్మముల

నేకశరీరము దాల్చుచుండును. పోవునపు డొంటిగా బోదులేక పోవుచుండును. పాపపుణ్యఫలితములుమాత్రమే ఆతనివెంట వచ్చును. నన్నుమాత్రము నీమాయలోఁద్రోయకకాపాడుము.

చ. దొరసినకాయముల్ ముదిమితోఁచినఁజూచిప్రభుత్వముల్సి
రుల్, మెఱుపులుగాఁగఁజూచి మఱిమేదినిలోఁ,దమతోడి వా
రుముం,దఱుగుటఁజూచిచూచి తెగునాయు వెఱుంగక మోహ
పాశము, ల్దరుగనివారి కేమిగతి దా 92

టీ. దొరసినకాయముల్ = వచ్చినశరీరములు, ముదిమితోఁచినన్ = ముసలితనముకలుగగనే, చూచి, ప్రభుత్వముల్ = అధికారములు సిరుల్ = సంపదలు, మెరుపులు = మెరుపులవలె వెంటనే చెడుపోవునవి, కాగన్ = కావున, చూచి, మఱి = మరియు, మేదినిలోన్ = భూమియందు తమతోడివారు = తమలోనుండెడివారు, ముందు తమకంటె ముందుగనే, అరుగుట = పోవుట (చచ్చుట) చూచి, తెగునాయువు = తగ్గిపోవు ఆయువును, ఎరుంగక = తెలియలేక, మోహపాశముల్ = మోహములనెడి త్రాళ్లుచే, తరుగనివారికి = తగ్గనివారికి, ఏమి, గతి = త్రోవ.

తా. రామా! శరీరమునకు ముసలితనము వచ్చుటయును, సంపదలు నిలకడకానివని తెలిసినను, తమలో బుట్టి పెరిగి తిరుగుచుండువారు తమకంటెముందే చచ్చిపోవుటయును

తన ఆయుష్షు, దినదినమును తగ్గుచుండుటయును కనులార చూచి యింకను భార్యపుత్రులయందును, ధనమునందును మోహము విడువలేనివారి కేమిదిక్కు.

చ. సిరిగలనాఁడు మైమఱచి చిక్కిననాఁడు తలంచిపుణ్యముల్
పొరిఁబొరిఁ జేయనైతి నని పొక్కినఁగల్గునె గాలిచిచ్చుపైఁ
గెరలిన వేళఁ దప్పిగొని కీడ్పడు వేళ జలంబుఁ గోరి త
త్తరమునఁ ద్రవ్వినం గలదె దా.... 93

టీ. సిరిగలనాఁడు=సంపదలు గలిగినప్పుడు, మైమఱచి=శరీరము తెలియక. చిక్కిననాఁడు=లోబడినప్పుడు,తలంచి=తలచుకొని, చేయనైతిన్=చేయలేకపోతిని. కదా, అని, పొక్కినన్-దుఃఖించినయెడల, కల్గునే=ఫలితముకలదా! గాలి, చిచ్చుపైన్=అగ్నిపైని కెరలిన వేళ = చలరేగినప్పుడు, దప్పిగొని, దాహమును పొంది, కీడ్పడువేళన్ = దప్పిచే బాధింపబడునపుడు, జలంబున్=నీటిని, కోరి, తత్తరములన్ = తొందరచే త్రవ్వినన్=నూయిత్రవ్వగా; కలదె=లాభము ఉన్నదా=లేదు.

తా. రామా! సంపదగలిగినప్పుడు శరీరము నెరుగక, నిన్ను తలంచుటమాని, దేహబలమును, ధనబలమును పోయిన తరువాత విచారించిన నేమిలాభము. ఇల్లు కాలుచుండగా నూయిత్రవ్వ ఆర్పెదనని నటుల సమయముపోయిన తరువాత లాభము లేదు.

ఉ. జీవన మింకఁ బంకమునఁజిక్కినమీను చలింప కెంతయుం
దావున నిల్చి జీవనమె తద్దయుఁ గోరువిధంబు చొప్పడన్
దావలమైనఁ గాని గుఱి దప్పనివాఁడు తరించువాఁడ
తావకభక్తియోగమున దా.... 94

టీ. జీవనము = చెరువునందలినీరు, ఇంకన్ = వట్టిపోగా, పంకంబునన్ = బురదయందు, చిక్కిన మీను = తగులు కొనినచేప, ఎంతయున్ = ఏమాత్రమును, చలింపక = భీతిని పొందక, తావున = ఉన్నచోటనే, నిల్చి = ఉండి; తద్దయున్ = మిక్కిలి, జీవనమె = నీటినే, కోరు విధంబు = కోరెడి రీతి, చొప్పడన్ = కలుగునట్లు, తావలమైన దానిన్ = ఉనికిఅయిన దానిని, గుఱి, తప్పనివాడు, తావకభక్తియోగముల్ = నీయొక్క భక్తియోగముచేత తరించువాడయా = సంసారమును దాటువాడవయ్యా.

తా. చెరువునందలి నీరెండిపోయినను అందలి బురదలో చిక్కిన చేప కదలక నీటినే కోరునటుల నీయందలిభక్తిని విడువక నిన్ను సేవించువాడు మోక్షమును పొందును.

చ. సరసునిమానసంబు సురసజ్ఞఁ డెఱుంగునుముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కోల నేకనివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చు నెట్లు వికచాబ్జమరందరసైకసౌరభో
త్కరము మిళింద మొందుకరియ దా.... 95

టీ. సరసునిమానసంబు=రసికునిమనస్సు; సరసజ్ఞుఁడు= చక్కఁగా రసమును తెలిసినవాఁడు; ఎఱుంగును=తెలియును. మున్కరాధముఁడు = మోటుమనుష్యుఁడు, ఎఱిఁగి = తెలిసి గ్రహించువాఁడా=తెలియఁగలవాఁడా ! దర్దురంబు=కప్ప, కొలను=చెఱువు, వకనివాసముగాఁగ=ముఖ్యమైన ఉనికిగా, ఉండి, విక....రము=వికసించిన తామరపూవుయొక్క తేనెయొక్క సువాసనలను, మిళిందము=తుమ్మెద, ఒందుక్రియన్=పొందునటుల, ఎట్లు=ఏలాగున, ఆరయఁగనేర్చున్=ఆలోచించనేరును (నేరదు)

ఉ. నోఁచితల్లిదండ్రికిఁ దనూభవుఁ డొక్కఁడెచాలు మేటి చే
చాఁచనివాఁడు వేఱొకఁడు చాఁచిన లేదన కిచ్చువాఁడునో
రాఁచి నిజంబ కానిపలుకాఁడనివాఁడు రణంబులోన మేన్
దాఁచనివాఁడు భద్రగిరి దా.... 96

టీ. నోఁచినతల్లిదండ్రికిన్=పుణ్యముచేసిన తల్లిదండ్రులకు, చే=చేయి, చాఁచనివాఁడు=చేయిచాచి ఒకరిని యాచింపనివాఁడును, వేఱొకఁడు=మఱియొకఁడు, చాచినన్=చేయిచాచి ప్రార్థించిన, లేదు, అనక, ఇచ్చువాఁడు, నోరు, ఆచి=ఆపుకొని నిజంబ=నిజమె, కానిపలుకు = కీడుమాటను, ఆఁడనివాఁడు= పలుకనివాఁడు, రణంబులోన్=యుద్ధమునందు, మేన్=శరీరమును, దాచినవాఁడు=దాచుకొనువాఁడు, ఐన, మేటి=గొప్పవాఁడగు, తనూభవుఁడు=కొడుకు, ఒక్కఁడే, చాలున్=చాలును.

తా. రామా! తల్లిదండ్రులు, చేసిన పుణ్యఫలము వలన, ఎంతకష్టకాలముననైనను, యితరులనుచే చాచి వేడని వాడును; ఇతరలు వేడిన తనశక్తికొలదిని యిచ్చువాడును, నిజమును చెప్పువాడును, యుద్ధమునందు శరీరమును దాచని వాడును అగు కుమారుడు కలుగును.

ఉ. శ్రీయుత జానకీరమణ చిన్మయరూప రమేశ రామ నా
రాయణ పాహిపాహి యని ప్రస్తుతిఁ జేసితి నామనంబునం
బాయక కిల్బిషవ్రజవిపాటన మందఁగ జేసి సత్కళా
దాయిఫలంబు నాకియవె దా.... 97

టీ. యుత్ర=సంపదగలవాడా! జానకీరమణ=సీతాపతీ చిన్మయరూపా = జ్ఞానరూపుడా! రమేశ=లక్ష్మీభర్తా, రామ, నారాయణ, పాహి, పాహి=కాపాడుము,=రక్షింపుము, అని, ప్రస్తుతిన్=స్తోత్రమును, చేసితిన్=చేసితిని, నామనంబునన్= నామనస్సునందు, పాయక=వదలక, కిల్బిషవ్రజవిపాటనము= పాపసముదాయమును పోగొట్టు నాశనము, అందగన్=పొందు నట్లు, చేసి, సత్కళాదాయిఫలంబు=శ్రేష్టమైన కాంతినిచ్చు ఫలమును నాకు ఈయవే.

తా. రామా! జానకీపతీ, ఆనందరూపా! నారాయణ కాపాడుము అని ప్రార్థించు నామనస్సునందు నివసించి నా పాపములను బాపుము.

ఉ. ఎంతటిపుణ్యమో శబరియెంగిలిఁ గొంటివి వింత గాదె నీ
మంతన మెట్టిదో యుదుతమైని గరాగ్రనఖాంకురంబులన్
సంతసమందఁ జేసితివి సత్కులజన్మము లేమి లెక్క వే
దాంతముగాదె నీమహిమ దా.... 98

టీ. ఎంతటిపుణ్యమో=అదియంతపుణ్యము. చేసెనో, శబరి, దానియెంగిలి, గొంటివి=పుచ్చుకొంటివి, వింతకాదె= ఆశ్చర్యముకాదా ? నీ, మంతనము, నీమనస్సు, ఎట్టిదో=ఎటు వంటిదో, ఉదుతఁ మైని=శరీరమునందు కరా....ల౯=చేతిగోళ్ల కొనలచేత, సంతసము = సంతోషము, అందన్=పొందినట్లు, చేసితివి, సత్కు....ములు=మంచికులమునందు పుట్టుటలు, ఏమి లెక్క=ఏమిలెక్క, నీమహిమ, వేదాంతముకదా=వేదములైనను కొనియాడ లేనిదిగదా.

ఉ. బొంకనివాఁడెయోగ్యుఁడరిబృందము లెత్తినచోటఁ జివ్వకున్
జంకనివాఁడె జోదు రభసంబున నర్థికరంబు సాఁచినం
గొంకనివాఁడె దాత మిముఁ గొల్చిభజించినవాఁడెపో నిరా
తంకమనస్కుఁ డెన్నగను దా.... 99

టీ. బొంకనివాడుయోగ్యుఁడు = అసత్యము పలుకని వాడు సాధువు, అరిబృందము=శత్రువుల సముదాయము ; ఎత్తినచోట౯ = వచ్చినస్థలమందు చివ్వకున్=యుద్ధమునకు, జంకనివాడే=భీతిపొందనివాడె, జోదు=బంటు, రభసంబునన్=

ఆతరత్తోడ, అర్థి=యాచకుడు. కరంబు=చేతిని సాచిన=చాచ్చినయడల, కొంకనివాడె = సంశయింపనివాడె, దాత, విన్నగను=ఆలోచింపగా, మిమున్=మిమ్ములను, కొల్చి = సేవించి; భజించినవాడెపో=పూజించినవాడే సుమీ, నిరాంతకమనస్కుడు=సంశయము లేని మనస్సుకలవాడు.

తా. రామా! అబద్ధమాడని వాడే యోగ్యుడు; యుద్ధమున వెనుదీయనివాడు వీరుడు, యాచించన వానికి లేదనక ఇచ్చినవాడు దాత, నిన్ను సేవించినవాడు నిర్మలమైన మనస్సు కలవాడు.

చ. భ్రమరము కీటకంబుఁగొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని పల్కుటఁజేసి భవాదిదుఃఖసం
తమస మెడల్చి భక్తిసహితంబుగ జీవుని విశ్వరూపత,
త్వమున ధరించు టేమరుదు దా....

టీ. భ్రమరము = తుమ్మెద; కీటకంబున్ = పురుగును కొని = తెచ్చి, పాల్పడి=శ్రమపడి, ఝూంకరణోపకారియై=ఝుంకారము నిచ్చి భ్రమరముగాన్ = తుమ్మెదగా, ఒనర్చునని = చేయునని, పలుకుటచేసి = పలికినందున. జీవునిన్=దేహిని. భవా....సము= పుట్టుక మొదలయిన చీకటినుండి, ఎడల్చి = విడిపించి, భక్తిసహితంబుగన్=భక్తితోగూడ, విశ్వరూపతత్వమునన్=విశ్వరూపతత్వమునందు; దరించుట=తాల్చుట, ఏమి, అరుదు=ఏమివింత లేదు.

తా. తుమ్మెదపురుగునుబట్టి ఝుంకారముచేత తుమ్మెదగాదానిని చేయుచుండగా నీవు నీచిద్రూపమునందు, మమ్ములను, సంసారదుఃఖముల పోఁగొట్టుట యొక వింతకాదు.

చ. తరువులుపూచి కాయలగుఁదత్కుసుమంబులుపూజగా భవ
చ్చరణము సోఁకి దాసులకు సారములౌ ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబరనికాయములై విరజానదీసము
త్తరణ మొనర్చుఁ జిత్ర మిది దా.... 101

టీ. తరువులు=చెట్లు, పూచి, పుష్పించి, కాయలు, అగున్=అగును, తత్కుసుమంబులు=ఆపూవులు, పూజగా, భవచ్చరణము=నీపాదము, సోఁకి=తగిలి, సారములు = మంచివి, ధాన్యరాసులై=ధాన్యపుకుప్పలై కరి....యములై=ఏనుగులు గుఱ్ఱములు, బంట్లు, వస్తువులసముదాయములై, విరజానదీసముత్తరణము=మోక్షమునకు అడ్డువచ్చెడు, విరజానదిని దాటించుటకు, ఒనర్చు=చేయును, ఇది చిత్రము=ఆశ్చర్యము.

తా. చెట్టుపూచిన పూవులను దెచ్చి నీకు పూజచేసిన అవి ధాన్యరాసులై విరజానదిని దాటించు తెప్పకూడ అగును.

ఉ. పట్టితి భట్టరార్యగురుపాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజ మొడిఁ బెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణకంజములందుఁ దలంపు వెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల దా.... 102

టీ. భట్టరార్యగురుపాదములు = భట్టాచార్యగురువుగారిపాదములు పట్టితిఁ=సేవించితిని, ఇమ్మేనియఁన్=ఈశరీరమునందు, ఊర్ధ్వపుండ్రములు, పెట్టితిఁ=పెట్టితిని, మంత్రరాజము=అష్టాక్షరీమంత్రమును (మంత్రములలో అధికమైనది) వడిఁబట్టితిఁ=గ్రహించితిని, అయ్యమకింకరాళికిన్=ఆయమదూతలసముదాయమునకు, బొమ్మకట్టితిఁ = అవమానముచేసితిని, మీచరణకంజములందున్=మీపాదపద్మములయందు, తలంపుపెట్టి=మనస్సునుంచి, పాప పుంజములను పో దట్టితిన్= (పోఁగొట్టితిని) ; ఎగురదన్నితిని.

తా. రామా! గురువుగారిని భట్టాచార్యులుగారిని చేసికొంటిని, శరీరమునందు, ఊర్ధ్వపుండ్రములను ధరించితిని, అష్టాక్షరీమంత్రమును గైకొంటిని. యమదూతలు నాదరి జేరజాలరు మీపాదములమీద నాదృష్టిని విడి నాపాపములను పాపికొంటిని.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్లకులోద్భవుం డనఁ బ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను దా.... 103

టీ. జగద్వల్లభ=లోకభర్తా, లింగమంత్రి, సుతుడు=కొడుకు, అత్రిజగోత్రజుడు = ఆత్రేయసగోత్రమునందు పుట్టిన

వాడు, ఆది శాఖ=ప్రథమశాఖ కలవాడును, కంచెర్లకుల... పుండు=కంచెర్లకులమున పుట్టినవాడు, అనగ=అనునట్లు, ... ద్ధుడనై కీర్తిపొందినవాడనై, ఎల్లకవులు, నుతింపగ = పొ... నట్లు భవదంకకితంబుగా=నీకంకితముగా ఈశతకము, అల్లన... చక్కగా, రచియించితిన్=వ్రాసినాను, గోపకవీంద్రుడన్ గోపకవి అనువాడను, నీకు దాసుడను, సేవకుడను.

తా. ఆత్రేయసగోత్రుడను, ప్రథమశాఖయందు కం... ర్ల మంగయామాత్యునకు పుత్రుడనై, నీకుసేవకుడనై, గో... కవియను నేను, కవులందరును కొనియాడునట్లు నీ కంకిత... గా యీశతము రచించితిని.

మంగళం.

దా శ ర ధీ శ త క ము.

స ం పూ ర్ణ ము.

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమండ్రి. 1924.